కన్నతండ్రి, జైలు పాలు కాగా, అతని విడుదల కోసం
కన్యాత్వాన్ని పణంగా కోరిన కామాంధునికి
కళ్లు తెరిపించి, కాంతిని ప్రసాదించిన శాంతమూర్తి గాథ!

యస్.వి. రంగారావు సమర్పించు శ్రీదేవి కంబైన్స్

# పెద్దక్కయ్య

దర్శకత్వం: బి.ఎ. సుబ్బారావు
నిర్మాత: తోట సుబ్బారావు

మాటలు: పినిసెట్టి
సంగీతం: ఘంటసాల
ఛాయ: ఎస్.ఎస్. లాల్
కళ: వాలి
కూర్పు: బి. గోపాలరావు
నిర్వహణ:
తోట రంగారావు
ఎస్.వి. సత్యనారాయణ

డిస్ట్రిబ్యూటర్స్
ఆంధ్ర: భారతీ
సీడెడ్: నవభారత్
నైజాం: ఉషా పిక్చర్స్
తెలుగునాడు: గౌరవ

JOTHEE

# ఉత్తరాలు

## దీపావళి సంచిక

శ్రీ కె రామలక్ష్మిగారి ఒడిది, ఉన్నవ విజయలక్ష్మిగారి జీవనరాగం క్రొత్త సీరియల్ నవలల ప్రారంభంతో ఎహా వలి కథానికలతో భానుమతి రామకృష్ణగారి హాస్యకథానిక అత్తగారి అతిథులతో మా హృదయాలను సంతోషపరిచి ముచ్చటైన ముఖచిత్రంతో మాకు కనులపండువ చేసిన దీపావళి సంచికను సకాలంలో మాకు అందజేసి ఎంపిక ... మా హృదయాలను ... కోరుచున్నాను

శెట్టి ... కొండరి (చింతలాంపల్లి)

## ముఖచిత్రం

దీపావళి సంచిక ముఖచిత్రం చాలా బాగుంది ... పులుము, ... పులుము ... కోకుండా వచ్చింది శ్రీమతి భానుమతి రామకృష్ణ గారి కథ కడుపుబ్బ నవ్వించింది. అందులో వాళ్ళ అత్తగారు రంగవల్లులు వేస్తానని అందరిని లోపటికి నెట్టినది మొదలు మళ్ళీ వాళ్ళయనగారు వచ్చే దాకా మధ్యదిచదువుతూ వుంటే, అబ్బ, చాల నవ్వు వచ్చేసి కళ్ళమ్మట నీళ్ళు కారినాయి

మైలవరపు సావిత్రీదేవి (విజయవాడ)

*  *  *

తక్కువ ధరలో ఎక్కువ ఆకర్షణీయంగా మీరు తయారు చేసిన 'పత్రిక' కన్నులపండుగగాయుంది. ముఖచిత్రం పత్రికలకు సాటిరాడు చిత్రకారుడు శ్రీ కె శేషగిరిరావ్‌కు మా అభినందనలు

ప్రథమ బహుమతి పొందిన 'మునురు' బాగుంది మూడవ బహుమతి రచయిత్రి కుమారి భట్టిప్రోలు బాలాదేవి తల్లిదండ్రుల ఇంటిపేర్ల విషయంలో మాకు ఒక అనుమాన మొచ్చింది. అది ఏమంటే 'ఈమె ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి వేల్పూరి సుభద్రాదేవి, రచయిత శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తిగార్ల జ్యేష్ఠ పుత్రిక' అని పరిచయం చేశారు కాని అంటే ఇంటిపేరు వేల్పూరి అన్నా లేక 'భట్టిప్రోలు' యుండాలి. ఈమా సమస్యకు జవాబిస్తారని ఆశిస్తూ.

— బద్రి అశోక్ కుమార్,
బద్రి గీతారాణి, లలితాదేవి (హైదరాబాదు)

## కథలు

ముచ్చట గొలిపే ముఖచిత్రంతో వెలువడిన దీపావళి (ప్రత్యేక) సంచిక నందు మూడవబహుమతి నందుకొన్న రేవులేదు ... కథ చాలాబాగుంది. మొదటి బహుమతి పొందిన కథ 'మునురు' ఒక

సూచిరిగా ఉంది. ముగతా కథలు మామూలే
వంక్తిగానే ఉన్నాయి. 3వ బహుమతి పొందిన
కథా[illegible] కుమారి భట్టి[illegible] బాలాదేవిగారికి
నా ప్రత్యేక అభినందనలు తెలుపు కోరెదను.

ఎస్. లక్ష్మిదేవి, పి. [illegible]రావ్,
(హైదరాబాద్)

* * *

10-11-67 వ తేది సంచికలో మీరు ప్రచురించిన [illegible]గారి 'శుభ్రవక్ష్మ'కథ ఎంతో సహజంగా ఉంది. ముఖ్యంగా నన్ను శేషశాయి పాత్ర ఎంతో ఆకర్షించినది.

టి. [illegible] (హైదరాబాదు)

సీరియల్

ఇటీవల మీరు ప్రచురించే 'అధ్యక్షుని మరణం' [illegible]న్నాను. నాకు ఇంగ్లీషురాదు. ఇంగ్లీషు [illegible] చాలా వాటిలో కెన్నెడీ మరణం గురించి [illegible] వేశారు, అవి చూసినప్పుడల్లా నాకు ఇంగ్లీషు రాదే అని బాధపడేదాన్ని. తెలుగు పుస్తకాలలో ప్రచురిస్తే బాగుండుననుకునేదాన్ని. నాకోరిక మీ

# ఉత్తరాలు

దయవల్ల ఇన్నాళ్ళకు తీరింది. 'అధ్యక్షుని మరణం' నేను ప్రతివారమూ చదువుతున్నాను. ఈవారం (10.11.67) సంచికలో శ్రీమతి కెన్నెడీ కూతురుతో "నాన్నని ముద్దు పెట్టుకుని సెలవు తీసుకుందాము. మనకెంత ఆప్యాయంగా చెబుదాము. నాన్న లేకపోవటం మనకెంత కొరతగా వుందో చెప్పాలి." అనటం చదివితే నా కనులలో నీరు తిరిగింది. పిల్లలు తండ్రికి గుడ్‌బై చెప్పటం చాలాబాధ కలిగించింది. మీరు ప్రచురించిన ఫోటో కూడా చాలా విషాదంగా వున్నది. 'అధ్యక్షుని మరణం' ప్రచురించి అందరికీ కెన్నెడీ మరణం గురించి తెలుసుకునే అవకాశం కలిగించినందుకు మీకు నా ధన్యవాదాలు.

— కోడూరి వాణీభాస్కర్ (విజయవాడ)

* * *

మట్టిబొమ్మలు, పూర్వాసంధ్యా ప్రవర్తతే సిరియల్స్ పాఠకుల హృదయాలకు హత్తుకుపోయినవి. కాని మట్టిబొమ్మలు రచయిత పోరంకిగారు భాను పాత్రకు చాలా అన్యాయం చేశారేమో అనిపిస్తుంది. కరుణ, అమాయకత్వము తొణికిసలాడే ఆయువతికి మరేవిధముగానైనా మంచిదారి చూపించి వుండివుండవల్సింది. శారద, ప్రసాద్, మధు పాత్రలను, చివరికాలంలో మాష్టారు అనుభవించిన హృదయావేదనను చాలాబాగ చిత్రీకరించారురచయిత.

పూర్వాసంధ్యా ప్రవర్తతే లో శంకరం మాష్టారి జీవితం ఆదర్శప్రాయమైన క్రొత్త పంథాలోపడింది. ఆయనకు శిష్యుడుగా వేణు చివరకు సుశీలను చేపట్టుటకు నిర్ణయించుకోవడంలో ఆదర్శప్రాయంగా వ్యవహరించాడు. చివరిలో అతడు పలికిన మాటలు భావగర్భితాలు.

కోటిపల్లి వెంకట సాయిబాబు (అమలాపురం)

## వనితాలోకం

'మూడో మనిషి' వ్యాసము చాల బాగున్నది. ఒక పచ్చని సంసారములో వాళ్ళ దాంపత్యము మధ్య మరొక స్త్రీ తనభర్త హృదయములో ప్రవేశిస్తే ఆభార్య పడే బాధను చాలా బాగా వ్రాశారు రామలక్ష్మిగారు వ్రాసిన వ్యాసములు చదువుటకు చాలా సరదాగా వుంటున్నవి. ఇటువంటి వ్యాసములు ఇంకా వ్రాయుమని కోరుతున్నా. ఆమెకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

తురగా శ్రీలక్ష్మి (రాజమండ్రి)

## పాఠకులకి మనవి

ఉత్తరాలు రాసేవారికి మనవి: ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి! కాగితానికి ఒకవయిపుననే రాసి ఉండాలి. రాసినవారి పేరు, చిరునామా తెలుగు అక్షరాలలోనే రాయాలి. వీలయినంత దాకా ఇంగ్లీషు, ఇతర భాషల అక్షరాలు వాడవద్దని లేఖకులకి మనవి చేసుకుంటున్నాము. (సం.)






# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 24-11-'67

ప్లవంగనామ సం॥ కార్తీక మాసం బహుళ సప్తమి

సంపుటము: 60 సంచిక: 12

స్థాపితము: 1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
4, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'చిక్కడు దొరకడు'లో జయలలిత


మనమధ్య విరోధం రానివ్వకు
నీకు నువ్వుగా పర్సు నా జేబులో పెట్టు
రాజులు
నేపాల్ రాజు చెప్పి
నదాన్ని బట్టి
నేపాల్‌కి
భయమూ లేదు
కాంగ్రెస్ అధ్యక్ష పదవి
ప్రధాన మంత్రి పదవి
ఆ గుర్రాన్ని కూడా మీరెందుకు సవారీ చేయ కూడదు?
పసివాళ్ళకే మద్దతు
మేకతోలు కప్పుకున్న తోడేలు!
ప్రజాస్వామ్యం మీద నమ్మకం
మార్క్సిస్టులు

# ప్రజల ఖర్చుతో మంత్రుల ప్రపంచయాత్ర!

శ్రీమతి గాంధీ మహాత్మాగాంధీగారిని గాని, తన తండ్రి పండిత జవహర్లాల్ నెహ్రూగారిని గాని మార్గదర్శకంగా ఎంచుకోవడం లేదు. పోనీ, రష్యా ప్రధానమంత్రి కోసిగిన్‌ని గాని, యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటోని గాని అనుసరిస్తున్నారా అంటే, అదీ లేదు. సుకర్ణో అడుగుజాడల్లో నడుస్తున్నారు! ఇక్కడొక నిజం చెప్పుకోవాలి. సుకర్ణోలాగ ఆమె ఆఫీసులో మిలిటరీమంత్రాంగాన్ని నమ్మడం లేదు, వారిమీద విరుచుకుపడడం లేదు. అంతవరకు మంచిదే.

పార్టీ ప్రయాసమీద, దేశం ఆమోదంమీద ఆమె ప్రధానమంత్రిగా ఎన్నుకోబడగలిగారు. ఇక్కడ సుకర్ణోగారికి శ్రీమతి గాంధీగారికి పోలిక కుదిరింది. కాని, సుకర్ణో అంతగా శ్రీమతిగాంధీగారికి దేశంలో బలంలేదు. ఎక్కడికి వెళ్ళినా తమను చూడ్డానికి ప్రజలు విరగబడిపోతున్నారు అని శ్రీమతి గాంధీగారు అనుకోవచ్చు. కాని, అది ఆమె గొప్పతనం కాదు. కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజుగారు భారతదేశానికి ఒక పని మనిషిని ప్రధానిగా చేశారు. ఆమెను చూడ్డానికి ప్రజలు కొట్టుమిట్టాడుతున్నారు. ఇది సహజం!

మనం ఇదివరలో చెప్పుకున్నట్టుగా, శ్రీమతి గాంధీని కమ్యూనిస్టు దేశాల పర్యటన కోసం ఎవరూ ప్రేరేపించలేదు. అలానే ఆమె పుట్టినిల్లులాంటి ఈజిప్టు వెళ్లమని కూడా ఎవరూ కోరలేదు. పార్లమెంటు బడ్జెట్ సమావేశం మే ఇరవయ్ రెండవ తేదీన ఆరంభమయింది. జూలై మధ్యలో విడిపోయింది. అప్పటి నుంచి మంత్రులు దేశాటనానికి పూనుకున్నారు.

## శ్రీమతి గాంధీ మేళంలోచేరి ప్రపంచయాత్ర చేయండి!

రాజీనామా ఇవ్వకముందు శ్రీ చాగ్లాగారు, రక్షణమంత్రి సర్దార్ స్వరణ్ సింగ్ గారు, వాణిజ్యమంత్రి దినేష్‌సింగ్‌గారు, పరిశ్రమల మంత్రి మియాఁ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గారు, టూరిజమ్ మంత్రి రాజా కరణ్‌సింగ్‌గారు, రవాణా మంత్రి డా. వి. కె. ఆర్. వి. రావుగారు, ఉక్కు మంత్రి చెన్నారెడ్డిగారు, కార్మిక మంత్రి లాలా జైశుఖ్‌లాల్‌హాథీగారు, విద్యామంత్రి బాబు టి. సేన్‌గారు, ఒక అపార శాఖామాత్యుడు ఉపప్రధాని మొరార్జీదేశాయ్‌గారు, ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీగారు—వీరంతా భారతదేశం ఖర్చులమీద ప్రపంచ పర్యటన చేస్తున్నారు. విదేశాల నుంచి ఆహ్వానాలు రానివాళ్లు దేశం లోలోపలే తెగ తిరుగుతున్నారు. ఇక్కడ నినాదమేమిటీ అంటే 'శ్రీమతి గాంధీ మేళంలో చేరి ప్రపంచ యాత్ర చేయండి' అని!

మంత్రులు పర్యటనల్లో మునిగి తేలుతున్నప్పుడు రాజధానిలో పరిపాలనా వ్యవహారాలు ఎగుడుదిగుడుగా తయారవుతున్నాయి. దేనిమీదైనా ఒక అభిప్రాయాన్ని తీసుకోవాలంటే దానికి నాధుడు లేక అనవసరమైన కాలయాపన జరిగిపోతోంది. ఉపమంత్రులు సయితం సమయానికి లభించక పోవడం వల్ల ఫైళ్లు పేరుకు పోతున్నాయి. ముఖ్యంగా మియాఁ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గార్ని నిందించాలి. (రూలు ప్రకారం ఫైళ్లకు విడుదల వుండదనుకోండి!) మియాఁ సాహెబ్‌గారికి తనకు మాలిన పనికి పోవడంలో ఎంతో అభిరుచి. ఏ పని చేయడానికయితే ఆయనకు జీతమిస్తున్నారో దానిని విడిచిపెట్టి తతిమా పనులన్నీ సమర్థిస్తుంటారు ఆ శ్రీవారు. అసలుపనికి టైము చాలదు! తర్వాత ఎంక్వయిరీలు చేస్తూ కూర్చుంటారు. ఒకటి పరిష్కారమయ్యే సూచన అలా అలా కనిపిస్తూ వుండగా రెండవ సమస్య తిష్ట వేసుకు కూర్చుంటుంది. ఇదీ ఆయన వ్యాపకం. శ్రీమతి గాంధీగారు వీరిని చూసి గర్విస్తుంటారు. ఆమెను చూసి భారతదేశం గర్విస్తుంటుంది!

## శ్రీమతి గాంధీ ప్రధానమంత్రి ఎలా అయ్యారు!

దేశం విచ్ఛిన్నమైపోతోంది. కాంగ్రెసు పార్టీ చిన్నాభిన్నమైపోతోంది. ఆర్థిక పరిస్థితి ఎప్పుడో అధోగతిపాలయింది. ఎంతో అస్థిరత్వం అగపడుతోంది. అయినా, 'గట్టిగా పట్టుపట్టిన కారణంగా' ప్రధానమంత్రి మాస్కోవెళ్లి రష్యా విప్లవం యొక్క అర్ధశతాబ్ది వార్షిక దినోత్సవంలో పాల్గొంటున్నారు 'ప్రభుతులు కూడా హీనరయ్యారు' అనే జాబితాలో వీరు కూడా ఉంటారన్నమాట!

ఇక్కడొక ప్రశ్నవెయ్యాలి. అది, 'శ్రీమతి గాంధీని ప్రధానమంత్రిగా ఎలా వుంచారు?' అనే ప్రశ్న. సమాధానం కోసం వెతుక్కోనవసరంలేదు. మొరార్జీ దేశాయ్‌గారు, యశ్వంత్‌రావ్ చవాన్‌గారు, బాబూ జగ్జీవన్‌రామ్‌గారు— ఈ సేవాదురంధరులు భారతదేశానికి ప్రధానులు కావాలని ఉవ్విళ్లూరుతున్నారు. ఎప్పుడా ఎప్పుడా అని ఎదురు చూస్తున్నారు. వారివారి అభిలాషల్ని అణగద్రొక్కుకోడానికి ఎవరూ ముందుకు రావడంలేదు. అందుచేత శ్రీమతి

గాంధీ ప్రధాని అయ్యారు. ఇంకా అవుతారు !

## సామాన్య ప్రజని మరచిపోతున్న ప్రభుత్వం

చక్కని వర్షాలు తర్వాత పంటలు బంపర్‌గా పండిపోతాయని వ్యవసాయంమీద అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఆ కమిటీకి లేదా దాని ఫార్వర్డ్‌బ్లాక్‌కి అధిపతి మాలవీయ తెగలోని ధారియాగారు. చేరవేస్తున్న ఆహార ధాన్యాలకి సేకరణ ధరని నిర్ణయించడం గురించి ఆయన ఏమీ చెప్పలేదు. ఇప్పటి ధరలు చాలా అధికంగా వున్నాయనీ, మధ్య తరగతి ప్రజ మలమల మాడుతున్నారనేది కనిపిస్తున్న యదార్థం. ధాన్యసేకరణలో అధిక ధరలు నిర్ణయించడంవల్ల జీవన ప్రమాణం పెరగదని ప్రభుత్వం భరోసా యిచ్చింది! సేకరణ రేటు పెంచినట్టయితే దుకాణంలో ధాన్యం ధర తగ్గుతుందని బాబు జగ్జీవన్‌రామ్ ప్రజల్ని నమ్మించడానికి చూస్తున్నారు. అది ఆయన ఇంట్లో చెల్లుబడి కావొచ్చు. తక్కువ తెలివితేటలున్న ఒక మనిషి, అధిక సేకరణ ధరవల్ల జీవన ప్రమాణానికి దెబ్బతగలదని నమ్మగల్గడం చాల కష్టం! పత్రికలు ప్రజలకు తెలియజెప్పాల్సిన అవసరం ఎంతయినా వుంది.

రగుల్కొంటున్న జాతివిచక్షణమీద మరో తీర్మానం వుంది. కార్మిక వివాదాలమీద, మందకొడి పనుల్ని మరీ చిందరవందర చేస్తున్న 'ఘెరావ్'లమీద ఎటువంటి తీర్మానమూ లేదు. పారిశ్రామిక తిర్యగ్గమనం మీదగాని, శాంతిభద్రతల క్షీణతమీదగాని, కాంగ్రెసులో విచ్ఛిత్తిమీదగాని ఈ కమిటీ ఒక ముక్కకూడా చెప్పలేదు.

యదార్థాన్ని దృష్టిలోవుంచుకుంటే, కాంగ్రెసువారు సామాన్య పౌరుడి గురించి అసలు ఆలోచించడంలేదు. సామాన్యుని జీవితం నానాటికీ రక్షణ రహితమైపోతోంది!

## జాతీయ విధానంలో జాతి నాయకుల పాత్ర

మార్క్స్, ఎంగిల్స్ ఇద్దరూ కలిసి భారీ ఎత్తున తయారుచేసిన కమ్యూనిస్టు ప్రణాళికలో ఒక సూక్తి వుంది:

'శృంఖలాలని తప్పితే నువ్వు పోగొట్టుకొనేదేమీలేదు, లాభం పొందాలంటే నీ ఎదుట బోల్డంత ప్రపంచముంది; సామాన్య ప్రజల దండును ఏకం చెయ్!' అనేదది.

మాలవియా, చంద్రశేఖర్, ధారియా ప్రభృతులు పోగొట్టుకోడానికి శృంఖలాలు కూడా లేవు. వారి పద్ధతుల్ని ప్రవేశపెట్టి దేశాన్ని అల్లకల్లోలంచేసి ప్రపంచాన్నంతా తమ అధీనంలోకి తెచ్చుకోవాలనే ఆశమాత్రం వుంది. సందర్భవశంగా, పండిత మాలవియాగారు జాతీయం అనేదానిమీద ఎప్పుడూ ఆలోచించలేదు. ఆయన మంత్రివర్గంలో వుండగా ఆయిల్ కంపెనీల గురించి కూడా యోచించలేదు. ఇప్పుడాయన మంత్రివర్గంలో లేరు గనుక, ప్రభుత్వం తప్పకుండా చెడిపోయివుండాలి! ఆయన విధానాన్ని వోటర్లు ఎంతవరకు ఆమోదించారో క్రిందటి ఫిబ్రవరిలో తెలిసిపోయింది!

చంద్రశేఖర్‌గారు, ధారియాగారు ఎప్పుడూ ప్రజల గురించే ప్రస్తావిస్తూ వుంటారు. వారు రాజ్యసభకి సభ్యులుగా వుంటూ ఏనాడూ ప్రజల బాగోగుల్ని దృష్టిలో వుంచుకున్న పాపానపోలేదు.

## గుర్తింపులేని కాంగ్రెసు

ఉపప్రధాని మొరార్జీదేశాయ్‌గారు నీతినిజాయితీగల కాంగ్రెసు వ్యక్తి. ప్రభుత్వంమీద, కాంగ్రెసు అభిప్రాయాలమీద ఆయన తరచు మాట్లాడుతూ వుంటారు. ఏ చట్ట ప్రకారం అయితే ఆయన ప్రమాణ స్వీకారం చేశారో ఆ చట్టం కాంగ్రెసును గుర్తించడంలేదు. ఇక్కడ ఒక విషయాన్ని ఉదహరించాలి. బ్రిటిష్ కార్మిక వర్గంగాని, కన్సర్వేటివ్ పార్టీగాని, వారి వారి తీర్మానాల్ని గవర్నమెంటుమీద రుద్దడానికి ప్రయత్నం చేయవు. ఆర్థిక శాస్త్రవేత్తల (వీరి యోగ్యత ఇంతవరకు యూనివర్సిటీలకే తెలును!) అభిప్రాయాల్ని సేకరించడంకంటె, చంద్రశేఖరంగార్ని పురికొల్పి బ్యాంకుల్ని జాతీయం చేయడం విషయంపై రాజ్యసభలో వాదించమంటే ఆయన అపని బాగాచేసి వుండేవారు. ఆయన అటువంటి తీర్మానం ఏదీ లేవదీయలేదు. అటువంటి తీర్మానాన్ని ప్రతిపాదించడంవల్ల వచ్చే నష్టాలు ఆయనకు బాగా తెలుసు. అందుకే మౌనంగా వూరుకున్నారు. దీనికి ఒకదారి తెన్ను ఎప్పుడేర్పడుతుందో చూద్దాం !

## శ్రీమతి కృష్ణా హాతీసింగ్

అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ఒక వనిత, గృహకృత్యాల్లో ఎంత శ్రద్ధగా వుంటుందీ అనేది అనుమానాస్పదమైన విషయం. శ్రీమతి క్రిష్ణ హాతీసింగ్ నెహ్రూగారి చెల్లెలు- ప్రసిద్ధ రచయిత్రిగాను, రాజకీయ వ్యక్తిగాను మనకందరికీ సుపరిచితురాలు.

వంటచేయడమన్నా, ఇంటిని అలంకరించి శుచిశుభ్రతలో కాపాడుకోవడమన్నా ఆమెకు ఎంతో ఆసక్తి. కుక్కల్నీ గుర్రాల్నీ పెంపకమంటే ఆమెకి సరదా. మహదైశ్వర్యంలో పుట్టి పెరిగినా అతి నిరాడంబరంగా జీవించారు. సాంఘిక సేవా తత్పరురాలిగా ప్రజలకెంతో మేలుచేశారు. ముఖ్యంగా గుడిసెల్లో నివసించే పేద ప్రజానీకానికి ఆమె చేసిన సేవ మరువరానిది. ఆమె దయాదాక్షిణ్యాలవల్లనే బొంబాయిలో 'పోలియో క్లినిక్' ఎందరో రోగులకి చికిత్స చేయగల్గుతున్నది.

సహాయ నిరాకరణోద్యమ సమయంలో పదిహేను మాసాలపాటు కారాగార శిక్ష ననుభవించారు. ఆ అనుభవాన్ని గూర్చి 'షాడోస్ ఆన్ ది వాల్' అనే గ్రంథాన్ని సంపుటీకరించారు. అందులో, కారాగారవాసంలో వుండే స్త్రీల చరిత్ర కథలుగా మనకి కనిపిస్తుంది. 'విత్ నో రిగ్రెట్స్' అనేది ఆమె జీవిత చరిత్ర. ముల్క్‌రాజ్ ఆనంద్‌తోకలిసి రాసిన మరో గ్రంథం 'ది బ్రయిడ్స్ బుక్ ఆఫ్ బ్యూటీ.'

నెహ్రూవంశంలో జన్మించిన రత్నాల్లో శ్రీమతి కృష్ణ హాతీసింగ్ ఒకరు. ఆమె నవంబరు తొమ్మిదవ తేదీన లండన్‌లో మరణించారు. — ఆర్

# రష్యా ఆర్థిక ప్రగతి: కొన్ని పోలికలు







▣ కమ్యూనిస్టు దేశాలలో పత్రికలకన్నా
పాశ్చాత్యదేశాల పత్రికలే రష్యా విప్లవ
50వ జన్మదినోత్సవం పట్ల ఎక్కువ
శ్రద్ధ చూపుతున్నాయని ఒక బ్రిటిష
సోషలిస్టు పత్రిక విలేఖరి అన్నాడు. ఈ
సందర్భంలో పేరు పొందిన పాశ్చాత్య విలే
ఖరులు రాస్తున్న వ్యాసాలు కొన్ని చదివితే
రష్యా సాధించిన ఆర్థిక అభివృద్ధి
పొగడ్తా, విప్లవావేశం సడలినందుకు
సంతోషం — విచారం రెండూ; చైనాతో
పోట్లాటని రష్యా అమెరికాకి 'ఎదురుగా
వాడుకుంటున్నదన్న అనుమానం, బాధా
ఇవన్నీ కనిపిస్తాయి. నేటి ప్రపంచంలో
అమెరికా తర్వాత రష్యాయే అతిబలవంత
మయిన దేశం అనటానికి సందేహం లేదు
కాని, ఎందరో విలేఖరులు ఎత్తిచూపినట్లు
రష్యా సంపదలో ఇంకా ఎన్నో పశ్చిమ
యూరోపియన్ రాజ్యాలకి వెనుకబడి ఉంది.
మొత్తం అంకెలు పెద్దవిగాఉన్నా 'మనిషి

వింత ఉత్పత్తి, ఆదాయం' అని చూస్తే తక్కువగానే ఉంటాయి. నేటికీ ఒక మనిషి ఉత్పత్తి తీసుకుంటే అమెరికన్ కార్మికుడు రష్యన్ కార్మికుడికన్నా రెండురెట్లు పయిన తయారు చేస్తాడని రష్యన్ నాయకులే అంగీకరిస్తున్నారు.

ఈ పుటలలో వేసిన బొమ్మలు రష్యా, అమెరికాల ఉత్పత్తి సంఖ్యల పురోగమనాన్ని చిత్రీకరిస్తాయి. వీటిని గురించిన వ్యాఖ్యలు ఎన్నో ఇంతకిముందే వెలువడ్డాయి కాని, ఈ బొమ్మలు పరిశ్రమలో అతి ముఖ్యమయిన పదార్థాల ఉత్పత్తి ఈ రెండు దేశాలలో ఎలా ముందంజవేస్తూ ఉన్నదో తెలుపుతాయి. ముందు ముందు రాబోయే సంచికలలో మరికొన్ని ఉత్పత్తి అంకాలకి సంబంధించిన చిత్రపటాలు వెయ్యవచ్చు.

* * *

మాస్కోలో పెద్దపెట్టున జరిగిన 'విప్లవోత్సవాల'లో పాల్గొన్న విదేశ ప్రముఖుల జాబితాని చూస్తే కొన్ని విశేషాలని గమనించవచ్చు. భారతదేశం, యుగోస్లావియా, రుమేనియా ఈ మూడు ముఖ్యమయిన మిత్రదేశాలే ప్రధానమంత్రి, లేక అటువంటి పదవికల అధికారిని పంపించాయి.

ఈజిప్టు అధ్యక్షుడు శ్రీ నాసర్ హాజరు కాలేదు. ఈ సమయంలో దేశం వదిలి రావటం మంచిదికాదని ఆయన అనుకుని ఉండవచ్చునని ఒక సుప్రసిద్ధ పత్రిక రాసింది.

ఇక క్యూబా—కొంతకాలంగా కాస్ట్రో రష్యాపట్ల నిరసన చూపిస్తూవచ్చారు. ఈ ఉత్సవాలకి అధ్యక్షుడిని—తనకంటే తక్కువ ప్రాముఖ్యంకల వ్యక్తి—పంపుతానని చెప్పి చివరికి ఒక ఆరోగ్యశాఖ మంత్రిని పంపించారుట.

చైనా సంగతి చెప్పనే అక్కరలేదు. అసలు పెద్దవారు ఎవరూ రాకపోగా వచ్చిన డెలిగేట్లు ఇద్దరూ ఉత్సవోపన్యాసాల మధ్యలో లేచి వెళ్ళిపోయారుట.

—కె.



# మురసొలి మారన్ ఘనవిజయం

"ద్రావిడ మున్నేత్ర కజగం పార్టీపై గల విశ్వాసాన్ని ప్రజలు మరోసారి ప్రదర్శించారు. మా సేవ వారికి సంతృప్తి కలిగించిందని చెప్పడానికి ఇదే నిదర్శనం" దక్షిణమద్రాసు లోక్‌సభ ఉపఎన్నికలో శ్రీ మురసొలి మారన్ విజయాన్ని పురస్కరించుకొని ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురై అన్న మాటలివి:

దక్షిణమద్రాసు లోక్‌సభ ఉపఎన్నిక ద్రావిడ మున్నేత్ర కజగానికి మరో విజయఘంటా మోగించింది.

డి. యం. కె. పార్టీని ఎదిరించి మద్రాసులో ఇంకొక పార్టీ ఏదీ నిలవలేదని ఈసారి స్పష్టంగా తెలిసిపోయింది. ఎన్నికలకు ముందే అధికార పక్షం గెలుస్తుందని అందరికీ తెలుసు. అయినా అది ఇంతటి ఘనవిజయమై వుంటుందని ఎవరూ వూహించలేదు.

క్రితం సార్వత్రిక ఎన్నికల్లో శ్రీ అన్నాదురై 81,978 వోట్ల మెజారిటీతో కాంగ్రెసు అభ్యర్థిని వోడించారు. ఆయనకి అప్పటికే కావలసినంత పేరు ప్రఖ్యాతులున్నాయి గనక అంతటి మెజారిటీ లభించిందని భావించారు.

యువకుడైన శ్రీ మురసొలి మారన్ కరుణానిధి మేనల్లుడుగా, రాజకీయ వ్యక్తిగా, పత్రికా సంపాదకుడుగా కొందరికి మాత్రమే పరిచితుడు. అటువంటి వ్యక్తి 1,05,703 వోట్ల మెజారిటీతో కాంగ్రెసు అభ్యర్థిని చిత్తుచిత్తుగా వోడించారూ అంటే అది అధికార పక్షం మీద ప్రజల అభిమానాన్ని ఋజువు చేస్తున్నది.

ఇప్పుడు కూడా హిందీ వ్యతిరేకోద్యమమే శ్రీ మారన్ గెలవడానికి అవకాశమిచ్చిందని చాలామంది అభిప్రాయపడుతున్నారు. శ్రీమారన్ పార్లమెంటులో హిందీ భాషోన్మాదుల వాదాన్ని తీవ్రంగా ఖండిస్తారని అందరూ ఆశిస్తున్నారు. 'హిందీవాదుల్ని ఎదిరించి పార్లమెంటులో మాట్లాడతానని' శ్రీ మారన్ తీవ్రంగా శపథం చేశారు. అది ఆయనకు వోట్లను గుమ్మరించింది.

అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ గారు స్వయంగా ప్రచారం చేసినా కాంగ్రెసు అభ్యర్థి శ్రీ పి. ఆర్. రామస్వామి నెగ్గుకు రాలేకపోయారు అంటే, మద్రాసులో ఇక కాంగ్రెసుకి బలం లేదని అర్థమైపోతూ వుంది.

ఆకాశరామ

# మగవారు కోరేదేమిటి?

ఇంటిపట్టున ఉండే ఆడవారు కావాలని మగవారు కోరుకుంటారు -- అనుకోవచ్చు ఆడవారు. కాని, మగవారి కోరికలు వేరే విధంగా ఉన్నాయని కొందరు పరిశీలకులు చెప్తున్నారు.

ఇటీవలే న్యూయార్క్‌లో కొన్ని 'పరిశోధనలు' జరిపారు. అభిప్రాయాలని సేకరించారు.

ఇద్దరు ఆడ డాక్టర్లు మగవారికి ఆడవారు ఇంట్లోనే పడిఉండటం ఇష్టం అన్నారుట, తమని ప్రశ్నించినవారితో.

మగ డాక్టర్లు ఇంకో రకమయిన జవాబులు ఇచ్చారుట. ఈ జవాబులని పట్టి పురుషులు తమ ఆదర్శవనిత అభిప్రాయాలు పురుషుల అభిప్రాయాలతో సరితూగాలని కోరుకుంటున్నట్లు ఊహించవచ్చు. కావాలని పురుషులు కోరుకుంటారని ఆడ డాక్టర్ల అభిప్రాయం.' అన్నారు పరిశోధకులు. 'కాని, పురుషులు అంత వినయంకల వనితని కోరుతున్నట్లు తోచదు.'

వీరు చెప్పే మరికొన్ని సంగతులు: పెళ్ళికాని ఆడవారే వృత్తిలో మంచిపేరు సంపాదించుకోవాలని పురుషులు అనుకోవటం లేదుట. వైవాహిక జీవితం జయప్రదం కావటానికి భార్య బాధ్యతే అధికం అని కూడా వారు అనుకోవటం లేదుట. (అధికం అని స్త్రీలు అంటున్నారుట.)

ఇంకా: తేలికగా పెళ్ళి కాకపోతే దొరికినవాడిని కట్టుకోవచ్చునని ఆడవారు అనగా ఇది తగదని మగవారు అన్నారుట. మొత్తంమీద వైవాహిక జీవితంలో ఆలుమగలిద్దరికీ సమాన హక్కులు ఉన్నాయని పురుషుల అభిప్రాయం.

ఇంత తేడాకల అభిప్రాయాలు ఉండడానికి కారణం ఏమిటో? స్త్రీ పురుషుల మధ్య సాన్నిహిత్యం తగ్గలేదని పరిశీలకుల అభిప్రాయం.

—(ఇన్‌ఫా)

# "జలుబును పోగొట్టుటకు నేను విక్స్ వేపొరబ్‌ను నమ్ముకొంటాను"




"ఈమధ్య మా అబ్బాయికి ఎక్కువ జలుబు చేసి సులువుగా ఊపిరితీసుకోలేక పోయేవాడు. నేను వానికి ఎన్నో రకాల మందులను వాడేను, కాని వాటివలన ఏమీ తగ్గలేదు. అప్పుడు, విదేశాలనుండి తిరిగి వచ్చిన మా డాక్టరుగారి చిన్న అబ్బాయి గోపాలం విక్స్ వేపొరబ్ సీసాను ఇచ్చి వాడమన్నాడు. పాపం, అతను మా ఇంట్లోకి వచ్చి దానిని మా అబ్బాయి ముక్కుమీద, గొంతుకమీద, ఛాతీమీద ఎలా రుద్దాలో కూడ చెప్పేరు. మర్నాడు ఉదయానికి మా అబ్బాయి జలుబు పూర్తిగా పోయి, హాయిగా ఊపిరి పీల్చుకొంటూ లేచేడు.

ఆ అనుభవము తరువాత, జలుబును పోగొట్టుటకు విక్స్ వేపొరబ్ మహా మంచి మందని నేను నమ్ముకొంటున్నాను. నేను ఎల్లప్పుడూ ఒక విక్స్ వేపొరబ్ సీసాను అందుబాటులో ఉంచుకొంటాను."




5 గ్రాముల ఆకుపచ్చని డబ్బీలలో కూడ లభిస్తోంది.

వాడుటకు సూచనలు: విక్స్ వేపొరబ్‌ను వాడు పడుకోబోయేముందు రుద్దండి



దానిని వాని ముక్కుమీద, రెండు వైపులా రుద్దండి



...వాని గొంతుక మీద, ఛాతీమీద రుద్దండి



...వాని వీపు అంతటి మీద రుద్దండి. కంబళి కప్పి పడుకోబెట్టండి

## "జలుబును పోగొట్టుటకు మీరూ విక్స్ వేపొరబ్‌ను నమ్ముకోండి"

# మూన్ రేకర్ -8.

# జేమ్స్ బాండ్ బొమ్మల సీరియల్







గాలాతో షికారుకి వెళ్ళేముందు సర్ హ్యూగోతో క్రెబ్స్ నా గదిలో సోదాచేయటం గురించి చెప్పాను.
"వాడిని శిక్షించాలి!"

"అతన్ని తిరిగి జర్మనీకి పంపించేద్దామా, సర్ హ్యూగో?"

"నువ్వు క్రెబ్స్‌ని బయట పెట్టినందుకు సంతోషంగా ఉంది. అతన్ని చూస్తేనే నమ్మబుద్ధి వేసేదికాదు."










"మనిద్దరికీ క్రెబ్స్ గొడవ అనవసరమైనది. మూన్‌రేకర్‌కి హాని రాకుండా కాపాడటమే మన ఉద్యోగం."

"అవును, క్రెబ్స్ ఎవరో చెప్పిన పని చేస్తున్నాడనుకుంటాను. ఏ విషయంలో కూడా అనుమానం తీర్చుకోవటం సర్ హ్యూగో అలవాటే."

"అతనంటే నీకు సదభిప్రాయమా?"
"అతను నిర్దాక్షిణ్యంగా, అమర్యాదగా ప్రవర్తించగలడు. మొహమూ అంత బావుండదు! కాని అతని దగ్గర ఉద్యోగం చెయ్యటం నాకిష్టం. 'మూన్‌రేకర్' నుంచి విజయం కావాలని కోరిక!"










గాలా, నేనూ రాకెట్ ప్రదేశాన్ని, దాని ఎగ్జాస్ట్ ద్వారాన్ని పరిశీలించాము, ఒడ్డు నించి.

"ఈ వైపు నుంచి రాకెట్‌ని దెబ్బతియ్యాలంటే సబ్‌మెరైన్ దళం ఒకటి వచ్చి చెయ్యాలి [illegible]"

"ఏమి గాలా? ఈతకి వస్తావా?"
"నువ్వు అంటేనా!"









"ఒక నిముషం ఆగు. ఇక్కడ నీటి లోతు సబ్‌మెరయిన్‌కి తగినంత ఉందో లేదో చూస్తాను."

గాలా దగ్గరగా నీటి మీదకి తేలి, ఒక ముద్దుతో ఆమెని చకితురాలిని చేశాను.

ఆమె ఊపిరి పీల్చుకునే లోపల తీరం వైపుకి వెళ్లిపోయాను.

"డామ్ యూ!"







తనని ముద్దు పెట్టుకున్నందుకు గాలా అలుక తీరలేదు.

"ఒడ్డుకి అవతలే సబ్‌మెరయిన్ వచ్చేందుకు కావలసినంత లోతు ఉంది."

"నిజంగానే."

ఎండలో ఎండుతూ ఉండగా నీటి పక్షుల్ని చూస్తూ ఉండిపోయాము. వాటిలో రెండు కొంచెం తమాషాగా ప్రవర్తిస్తున్నాయి.

"జాగ్రత్త!"







ఒక్క ఉదుటున గాలా మీద పడ్డాను.

మా పైనున్న దిబ్బ భాగం విరిగిపడింది.

(ఇంకా ఉంది)




**పి. యస్. కె. ఆర్, ఒంగోలు**

నా మదిలో ఊహలు, ఆశయాలు ఆశలు ఉండును. కాని వాటి సాధ్యా సాధ్యములు ఊహించుటకు అసాధ్యంగా ఉన్నది ఎందువలన?

మీ ఊహలు ఎప్పుడూ నేల విడిచి సాము చేయు చూసుండుట వలన.

**జి. సి, రాయికుదురు**

ఎదుట బాగా మాట్లాడి పక్కని తిట్టే వారిని ఏమనాలి?

నోటితో మాట్లాడుతూనే నొసటితో వెక్కిరించే వారికంటే వీళ్ళు కొంత మెరుగు అనుకోవాలి.

**వి. వి. ఎస్, కరీంనగరు**

జీవితం కూడా పోటీ వ్యాపారం లాంటిదే నంటారా?

వ్యాపారం కాకపోయినా పోటీ తప్పదు. 'బ్రతుకు, బ్రతకనీయి' అన్న మాత్రం పోయి 'బ్రతుక నేర్పు' అన్నదే ఇప్పుడు అమలులో ఉంది.

**వి. సి. కె, ఆలూరు**

స్త్రీ ప్రత్యక్ష దైవం అంటూనే తెగ బాదే సాటివారిని ఏమనాలి?

మనుష్యులని.

**బి. ఎస్. ఎమ్, భీమడోలు**

ఆశ్రయం యిస్తారు కదా అని అర్థిస్తే అవమానించారు. ఏం చేయాలి?

నేల మీద పడితే పాదాలు నెప్పి పెడతాయని ముళ్ల కంచె మీదికి గెంతిందిట ఒకనక్క. పాదాలు గీసుకుపోయి రక్తం వచ్చింది. 'నాకు సహాయం చేస్తావని ఆశించి నీ మీద పడితే ఇలాగా చేస్తావు?' అని అడిగింది. "నన్ను ఆనుకోవడం తప్పు. నా తత్వం అందరికీ గుచ్చుకోవడమే కదా?" అని బదులు చెప్పింది ముళ్లకంచె. స్నేహితుడో శత్రువో తెలుసుకోకుండా అర్థిస్తే అలానే జరుగుతుంది మరి!

**జి. ఎన్. ఆర్, గంటి**

మనిషి చెడ్డని సంపాదించినంత తొందరలో మంచిని సంపాదించలేడు. కారణం?

చెడుకి సవాలక్ష చేతులు, మగాతులు. మంచి చేయి ఒక్కటే. నోరూ ఒక్కటే అందుచేత.

**పి. జి, కరీంనగర్**

అక్కయ్యా. మీరిన్ని ప్రశ్నలకెలా జవాబులు యివ్వకల్గుతున్నారు?

వరదాగా చెల్లెలా.

**కె. ఎల్. జి. ఎస్, బోడసకుర్రు**

అక్కయ్యా, మీరు కూడా కుటుంబ నియంత్రణ అవలంబించారా?

ఆఁ.

**ఎమ్. ఎమ్, కరీంనగరు**

వ్యక్తిగత సమస్యలకి మీరు సమాధానం యివ్వగలరా?

అవి వ్యక్తిగత సమస్యలు అయినప్పుడు సమాధానం నేనెలా యిస్తాను?

**డి. ఎస్. ఎన్, కడమలకాల్వ**

జీవితం అంటే ఏమిటి?

వర్తమానం.

బాంధవ్యం అంటే ఏమిటి?

ఈ వర్తమానాన్ని రాగరంజితం చేసేది.

నా అనే పదానికి అర్థం ఏముంది?

'నా' అనేది లేనివాడు కాని దాని అర్థం తెలిసి రాదు.

**ఎమ్. ఎ, కులల్లూరు**

కొత్తవారికి మీరు జవాబులు యివ్వరని నా చెల్లెలు, ఎవరికైనా ఇస్తారని నేను వాదించుకున్నాం. ఎవరు కరెక్టు?

ఏరాయి అయితేనేం పళ్లూడ కొట్టుకుందుకు? ఎవరి ప్రశ్న అయితేనేం సమాధానం చెప్పేందుకు?

**డి. హెచ్. పి, విశాఖ**

నిరుద్యోగ సమస్యపై మీ అభిప్రాయం?

అది రావణ కాష్టం అని.

**బి. ఆర్, టెక్కలి**

'చేతకాని తనం' కథ వ్రాసినది మీరేనా అక్కయ్యా?

ఆ, ఆ 'చేతకానితనం' నాదే తమ్ముడూ.

---

ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి, ఆంధ్రసచిత్ర వారపత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥

---

**టి. ఆర్, విజయనగరం**

గుణం ముఖ్యం అంటారుకదా? మరి అందాన్ని చూసి ప్రేమిసున్నారెందుకు?

కనపడని గుణం సంగతి దేవుడెరుగు? కనీసం చూడ్డానికైనా బాగుందికదా, అన్న మనస్తత్వంతో అలా చేస్తారు.

**సి. ఎస్. ఎల్, సామర్లకోట**

పూర్వజన్మపై మీ అభిప్రాయం? మనిషి జన్మ ఎత్తినవాడు తిరిగి పశుపక్ష్యాది జన్మ లెత్తుట సంభవమా?

పూర్వజన్మ జ్ఞాపకం ఈ జన్మలో ఉండక పోతేనే సుఖంగా బ్రతకవచ్చు— ఇక పశుపక్ష్యాది జన్మ లెత్తడం అన్నది ఈ జన్మలో చేసిన పనులను పట్టి ఉంటుందేమో అని నా భయం.

**వి. కె, శ్రీశైల ఆత్మకూరు**

ఊహలు ఊహలుగా ఉన్నంతవరకు మధురంగా ఉంటాయి వాటినే వాస్తవం చేసుకోవాలని చూస్తే విషాదం అనుభవించవలసి వస్తుంది. ఎందుచేత?

ఆ ఊహలు నేలూనినవైతే విషాదంగా ఎందుకు రూపం దాలుస్తాయి?

**వి. ఆర్, కంభం**

మా యింట్లో నన్ను వంక పెంచని దంటూ ఉండడంలేదు? ఎలాగ?

ప్రీతిలేని భర్త పెరుగులో రాళ్ళన్నాయంటాట్ట. వంక తెంచదలిస్తే దానికి అంతెక్కడ?

**వి. వి, సంగారెడ్డి**

కోపంతో అరిచేస్తారు. ఫో పక్కకి అంటారు. తప్పుకు పోకపోయామా దెబ్బలు తప్పవు! ఇలాంటి పెద్దవారితో ఎలాగ?

దెబ్బలు తప్పాలంటే తప్పుకోవడమే — తమ్ముడూ, మేకా పులీ కథ వినలేదా? (పూర్వం ఆకలిగొన్న పులికళ్ల నో మేకపిల్ల పడింది. 'నన్ను రక్షించు, సాధువుని' అని బ్రతిమాలింది మేకపిల్ల. పో లే అని మేకపిల్లని సింహం పొమ్మంది. దానితో మేకపిల్లకి ధైర్యం వచ్చింది. 'నేనంటే ఇష్టం కాబట్టే సింహం నన్ను వదిలేసింది' అని అక్కడే తచ్చాడసాగింది సింహం అటూ ఇటూ తిరిగి వచ్చింది. మళ్ళా చూసింది. ఏడింది మేకపిల్ల. ఏముంది గుటుక్కున మింగి పూరుకుంది.

**కె. ఎస్, జయపురం**

మనని పట్టి రోజులా? రోజులని పట్టి మనమా?

అదో విషచక్రం. ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి.

# ఎవరి పిచ్చి వారికి....



కె. రామలక్ష్మి

కొత్తగా పెళ్ళి అయిన ఒకాయన చాలా ఖమ్మతయిన నేరం మోపాడు భార్యమీద. 'మాకు పెళ్ళి అయి ఆర్నెల్లు దాటింది. నా భార్య చూడ డానికి అందంగా ఉంటుంది. చక్కగా వంట చేస్తుంది. ఇల్లు కూడా శుభ్రంగా ఉంచుతుంది. ఎంతో సౌమ్యంగా ఉంటుంది. నా ఆనందాన్ని ఓ మూలకి నెట్టేసి నన్ను పిచ్చెత్తిస్తున్న ఒకే ఒక గుణం ఉంది ఆమెకి. ప్రతిరోజూ యిల్లు తిరిగి వందిరేస్తూ ఉంటుంది' అన్నాడు. ఇన్ని సుగుణాలున్న మనిషి పిచ్చిదా అని ఓ క్షణం తోచినా — ఆవలాయన కంప్లయింటు అర్థం కాలేదు. 'మారనేదేమిటి? ఇల్లు తిరిగి వందిరేస్తుందంటే — ప్రతి చిన్న విష యానికీ దెబ్బలాడుతుందనా?' అని అడిగితే ఆయన వివరణ యింకా ఆశ్చ ర్యంగా ఉంది!

'శెలవిలా ఆఫీసుకి వెళ్ళడం తర వాయి — అన్నిగదులూ సర్దేస్తూ ఉంటుంది! సాయంత్రం యింటికి వచ్చేసరికి మళ్ళీ ఏదో కొత్త యింట్లో ఉన్నట్టుంటుంది నాకు. గోడలకి ఉన్న ఫొటోలు యిటువి అటూ అటువి ఇటూ పెట్టేస్తుంది. ఇక్కడుండే కుర్చీ ఆ మూలకి; ఆ మూలది యింకో గదిలోకి మార్చేస్తుంది. టేబిలు రక రకాల పొజిషన్లకి మారుస్తూ ఉంటుంది. ఈరోజే గది బెడ్ రూమ్ అంటుంది. రేపటికి, ఎల్లుండికీ ఈ మంచాలు ఏ ఏ గదులకో మారు స్తుంది ... రోజూ ఓ ఇంట్లో కాపురం ఉన్నట్టుంటుంది నాకు. అలా మార్చవద్దని ముద్దుగా చెప్పి చూశాను. బతిమాలి చూశాను. కోపంగా చెప్పి చూశాను. ఏం లాభంలేదు. ముద్దుగా నన్నగా నవ్వేసి ఊరుకుంటుంది. 'ఇలా ఉంటే ఇల్లు ఇంకా విశాలంగా ఉంటుందేమో అని తోచింది.' అంటుంది. ఏరోజు కారోజు యింటికి వెళ్ళడం అంటే భయంగా ఉంది. నాకేదైనా స్పెషల్‌గా చేస్తుందన్న సంగతి గుర్తువస్తే తప్పించి యింటికి వెళ్ళ బుద్ధికావడంలేదు. ఓరోజిలాగే అలసి సొలసి ఇల్లు చేరేసరికి నే నడుం వాల్చే కుర్చీ ఉండవలసినచోట లేదు సరికదా అక్కడో బల్లో స్టూలో అయినా తగలేయలేదు. నాకు చచ్చే అంతకోపం వచ్చి అరిచేశాను. ఆమె ఏడుస్తూ గదిలోంచి బయటికి వెళ్ళి పోయింది... ఈ రకం అమ్మాయిలకి మందేమిటి? నాకు తెలిస్తే బాగుం డును' అంటూ వాపోయాడు. పాపం! అనిపించినా, ఈయనగారేం కష్టపడి పోతున్నాడు. ఆవిడగారు సామాను సర్దితే అవ బుద్ధివేయడం సహజం. ఇంట్లో ఒకచోట అలవాటైనవి క్షణ క్షణానికీ మార్చుస్తే ఇబ్బందిగానే ఉంటుంది. మగవారికి ఎక్కడ ఉండ వలసినవి అక్కడే అలవాటైన చోట ఉండాలనిపిస్తుంది (వారి భార్యలతో సహా!) మగవారు బయట ప్రపంచంలో తిరుగుతారు. రోజంతా రకరకాల పనులు చేస్తూ కాలక్షేపం చేస్తారు. కాని కొందరాడవాళ్ళు ఇంటికి కట్టు బడిపోతారు. కబుర్లు చెప్పుకొందు కైనా ఒక్కొక్కప్పుడు వారికి కంపెనీ ఉండదు — పాలమ్మి, కూరలవాడూ తప్పించి. ప్రతిరోజూ చేసిన పనులు చేస్తూ విసుగెత్తిపోతారు. అలాంటి సమయంలో వారాని కోసారి బజారు కెళ్ళడమే వారికో పండగ రోజులా ఉంటుంది. అందుకే ఇంట్లోనే ఏదైనా చేద్దాం అన్న బాధ పీడించి పని ప్రారంభించుతారు. ఇంట్లో సామాను అటునుంచి ఇటూ ఇటు నుంచి అటూ సర్దడానికి మించిన సీనరీ మార్పు వాళ్ళేం చెయ్యకలరు చెప్పండి? దుబారాచేసి అనవసరమైన వాటికి డబ్బు తగలేసే అలవాట్ల కంటె ఈ అలవాటే మంచిదని మెచ్చుకోవాలి. నిజానికి నే పైన చెప్పిన ఆయన! జీవితం బోరింగుగా ఉంటే ఏదైనా హాబీ సృష్టించుకోవాలి. అప్పు డిలాంటి బాధ ఉండదు. ఏ హాచ్ వర్క్ కుట్టడంలాంటిదో ప్రారంభిం చుతే — ఇంట్లో పనికే ఎగనామం పెట్టే అంత ఇంటరెస్టు పుట్టుకొస్తుంది. అప్పుడింక యిల్లేం సర్దుతుంది — అని ఇలా నేరాలు చెప్పిన ఆయన వాపోయే ప్రమాదం కూడా ఏర్పడుతుంది! ఎవరి పిచ్చి వారి కానందం అని ఏదో ఒక పిచ్చి సరదా అభిరుచి సంపాదించు కోవడం ఇరవైనాలుగు గంటలూ ఇంట్లో ఉండే గృహిణికి అత్యవసరం

శ్రీమతి పరిమళా సోమేశ్వర్

# కాలేజీల్లో సహవిద్య అవసరమా?

ఈ ప్రశ్న ఒకరకంగా చాలా పాతదే కావచ్చు కాని చరిత్ర పునరావృత్తమౌతుం దన్నట్లు కొన్ని సమస్యలు దేశ కాలాలతో సంబంధం లేకుండా పునరుద్భవిస్తూ ఉంటాయ్ అలాటి వాటిలో యీ సహవిద్య ఒకటి. నిజానికి పాశ్చాత్య పద్ధతిలో విద్యాభ్యాసం ప్రారంభమైన దినాల్లో కన్న యిప్పుడే బాలికల ప్రత్యేక పాఠశాలలు విరివిగా కనపడుతున్నయ్. ముఖ్యంగా కళాశాలలు ఆ రోజుల్లో ఏ ఒకటి రెండో తప్ప మిగతావన్నీ సహవిద్య ఉన్నవే. కాని ఈ రోజుల్లో బాలికా కళాశాలలను గూర్చిన ఆందోళనలు వాటి స్థాపనంకోసం జరుగుతున్న అపారమైన కృషి చూస్తుంటే ఆశ్చర్యంతోపాటు బాధకూడా కలుగుతోంది. దానికి తోడు సనాతన భావాలుగల చిన్న పట్నాలలో కంటె యెంతో అభివృద్ధి చెందిన సిటీలలోనే బాలికా పాఠశాలలసంఖ్య ఎక్కువగా ఉంటోందన్న సంగతి మరీ ఆశ్చర్యకరంగా ఉంది.

ఎందుకిలా జరుగుతోంది? అసలు సహవిద్య అంటే ప్రజలలో (ప్రభుత్వానికి కూడా) యెందుకింత అయిష్టత కలుగుతోంది? ఈ ప్రశ్నలు వేసుకుంటె యీ సహవిద్య బాల బాలికల నైతిక జీవితాన్ని కలుషితం చేస్తుందేమోనన్న భీతే మొదట స్ఫురిస్తుంది. కాని సూక్ష్మంగా ఆలోచిస్తే బాలికా కళాశాలల్లో జరిగేన్ని అల్లర్లు, అత్యాచారాలు కోఎడ్యుకేషన్ ఉన్న కాలేజీల్లో జరగనే జరగవని అనుభవ పూర్వకంగా కూడా చెప్పవచ్చు.

కళాశాల విద్యార్థినీ విద్యార్థుల నైతిక జీవితాన్ని గురించి ఆలోచించేముందు అసలు అవినీతి (ఈ సందర్భంలో) అంటే యేమిటి? ఎందుకు, యెలా వ్యాపిస్తుంది అన్న సంగతి మనం తెలుసుకోవాలి.

కళాశాలల్లో ప్రవేశించే బాల బాలికల వయస్సు సాధారణంగా పదిహేను — ఇరవై సంవత్సరాల మధ్య ఉంటుంది. ఈ వయస్సులో ఆడవారికి మగవారంటే, మగవారికి ఆడవారంటే విపరీతమైన కుతూహలం ఉండటం సహజం. ఇరుపక్షాల మధ్యఉండే ఆకర్షణకి కూడా యీ కుతూహలం, యింకా చెప్పాలంటే ఎదుటి వ్యక్తిని గూర్చిన అజ్ఞానం (తెలియక పోవటం) కారణాలు అని చెప్పవచ్చు. ఈ కుతూహలమే శృతి మించినపుడు అనేక వికారరూపాలు, ధరిస్తుంటుంది. వీటి ఫలితాలు సహవిద్య ఉన్న కళాశాలలోకన్న ప్రత్యేక కళాశాలలున్నపుడే తీవ్రతరంగా ఉంటాయన్న సంగతి గమనించ తగ్గది.

దీనికి కారణాలుకూడా పరిశీలిద్దాం. సహవిద్యగల కాలేజీల్లోని వాతావరణం బయట వాళ్ళంతా అనుకునేంత భయంకరంగా ఉండదు. పైగా అక్కడ విద్యార్థులను మంచి కట్టు బాట్లలో ఉంచుతారు. ప్రిన్సిపాలు దగ్గరనుండి, ప్యూను వరకు అమ్మాయిలకు అన్నివిధాల రక్షణ లభించేట్లు చూస్తుంటారు. ఈ రకమైన చర్యలన్నీ అతి సహజంగా జరిగిపోతుంటాయ్. అంతే కాక ఏ ఒకరిద్దరు విద్యార్థులన్నా అసభ్యంగా ప్రవర్తించినా ప్రిన్సిపాలు వెంటనే తగిన చర్య తీసుకుని నయానో, భయానో వాళ్ళను సన్మార్గంలోకి తేవటానికి ప్రయత్నిస్తారు. అందుకే సహజంగా చెడ్డవాళ్ళయినాకూడా శిక్షకు వెరచి విద్యార్థులు సక్రమ పద్ధతిలో ప్రవర్తించటానికి వీలవుతుంది.

అదీకాక మనం మామూలు విద్యార్థినీ

## డాక్టర్ కబుర్లు

### ట్రికినోసిస్ రూపాలు!

ట్రికినోసిస్ వ్యాధికి ఎన్నో రూపాలు. సరిగ్గా ఉడకని పందిమాంసం తింటే ఇది వస్తే, ప్రమాదం ఉంది.

ఇది జలుబు రూపంలో — తలలోకాని రొమ్ములో కాని, క్షయ, గుండెజబ్బు, మూత్ర పిండం రోగంకింద, పోలియో, రూపాలలో కనిపించవచ్చు. కొందరిలో రోగచిహ్నాలు కనిపించవు! మరణం (దీని వల్ల) సాధారణంగా కలగదు.

ఏదయినా అస్వస్థతని గుర్తుపట్ట లేకపోతే ట్రికినోసిస్ కోసం పరీక్షించాలి.

పందిమాంసాన్ని పవునుకి అరగంట చొప్పున సరియైనా వండాలి. లేత ఎరుపు రంగు ఉన్న పంది మాంసాన్ని తినరాదు. తెల్లబడేదాకా వండాలి.



హెచ్. ఎల్. హెర్ష్వెవ్
(కాపీరయిటు)

# బ్రూక్ బాండ్

# బాన్

## ఇన్‌స్టెన్ట్ కాఫీ

"ఎప్పుడూ అప్పటికప్పుడు వచ్చే
మనోహరమైన సువాసనతో కూడినట్టిది!"




మ్‌మ్....

**ఆ కమ్మదనం! ఆ సువాసన!
అది ఖచ్చితంగా బాన్
అయి వుంటుంది!**

ఒక బాన్ టిన్ను కొనండి. దానిలో అసలైన కాఫీ తృప్తిఉంది. వేడి నీరు చేర్చిన వెంటనే బాన్‌లోని 'కమ్మని' సువాసన వెదజల్లే అసలైన కాఫీ వెలువడుతుంది. జ్ఞాపక ముంచుకోండి—బాన్ నూటికి నూరుపాళ్ల కాఫీ. బాన్ ఎన్నికచేయబడిన మంచి కాఫీ గింజలతో తయారుచేయబడినట్టిది. దానిలోని కమ్మదనము, సువాసన, కొత్తదనము పోకుండా గాలి చొరని సీలువేయబడిన టిన్నులలో మీకు వస్తుంది. కమ్మదనము, సువాసన, నాణ్యత ఉన్నట్టిది బాన్ ఇన్‌స్టెన్ట్ కాఫీ. ఈ రోజే కొని చూడండి. దానికి అదే సాటి; ఎందువల్లనంటే "ఎప్పుడూ అప్పటికప్పుడు వచ్చే ఆహ్లాదకరమైన సువాసనతో కూడినట్టిది"

దానిని తయారుచేయటం చాలా తేలిక! మీరు చేయవలసినదల్లా ఒక టీస్పూను బాన్‌కు వేడినీరు చేర్చటమే వెంటనే కమ్మని సువాసన వెదజల్లే అసలైన కాఫీ తయారవుతుంది. ఎన్ని కప్పులు కావాలన్నా తయారు చేసుకోవచ్చు—బాన్ అసలైన కాఫీ!

BTD/9TEL

తీసుకున్నట్లయితే పైన నేను చెప్పిన 'కుతూహలం' అన్నది సహవిద్య ఉన్న కాలేజీల్లో అంతగా ఉండదు. తనతోపాటు కూర్చుని లెక్చరర్లు చెప్పే పాఠాలు వింటూ, తనతో సమానంగా గంటల తరబడి నిల్చుని 'ప్రాక్టికల్సు' చేసే అమ్మాయిలలోని 'ఆడతనాన్ని' గూర్చిన ఆలోచన అతనికి రాదు. అలాటప్పుడు ఆమెని తోటి విద్యార్థిగానే చూస్తాడు తప్ప మరో ప్రత్యేకమైన భావమేమీ కలగదతనిలో. ఐనప్పటికీ సహవిద్య గల కళాశాలల్లో అవాంఛనీయమూ, అక్రమమూ అయిన విషయాలేం జరగవనటం పొరపాటు కావచ్చు. అక్కడా కొన్ని లోపాలు ఉండవచ్చు. దానికి కారణం ఒక్క సహవిద్యే అనటం మాత్రం పొరపాటు. ఆ లెక్కన పాఠశాలల్లో కాక ఏ ఇతర రంగాలలో యిలాటి సంఘటనలు లేవా? అవినీతి అన్నది మానవుడు జన్మించిన దగ్గరనుండి అతని నీడలా ఒక రూపంలో అంటిపెట్టుకుని వస్తూనే ఉంది. దానికి అనవసరమైన కారణాలు ఆపాదించటం సబబుకాదు. స్త్రీకి చదువు చెప్పిస్తే చెడిపోతుందన్న విషయం ఎంత తర్కశూన్యమైనదో సహవిద్యగల కళాశాలల్లో అవినీతి ఉంటుందనుకోవటం కూడా అంత అర్థహీనమైనదే!

బాలికల మనస్తత్వంపై కూడా సహవిద్య యెన్నో ఆశించతగిన పరిణామాలను తెస్తుంది. స్త్రీలకు సహజంగా అలంకరణపై మోజెక్కువ ఉంటుంది. ఆ అలంకరణ శ్రుతిమించి ఎబ్బెట్టుగా తయారవకుండా ఉండాలంటే సహవిద్యగల కళాశాలల్లోనే అది సాధ్యమవుతుంది. ఎందుకంటే బాలికలు (సమాజంలో) సాధారణంగా తమ అలంకరణ, ప్రవర్తన ఎదుటివారి విమర్శకు గురి అయితే సహించలేరు. అందుకే సాధ్యమైనంత భయభక్తులతో తమ కోరికలకు కళ్ళెంవేసుకుని సభ్యతగా, వినయంగా ప్రవర్తిస్తారు. తోటి విద్యార్థుల సమక్షంలో, ఒకవేళ కొద్దిగా ఫాషన్‌గా కనపడితే విద్యార్థులు వెంటపడి ఎక్కడ యేడిపిస్తారోనన్న భయం ప్రతి బాలికకూ ఉంటుంది.

అదే ప్రత్యేక కళాశాలల్లోనయితే యిలాటి భయాలేవీ ఉండనందున వేషభాషల్లో ప్రవర్తనలో విశృంఖలతను ప్రదర్శించటానికి అవకాశం ఉంది. బాలికల కళాశాలల్లో ఒకరిని మించి ఒకరు 'కాంపిటేటివ్ స్పిరిట్'తో అలంకరణ చేసుకుని చివరకు కొన్ని సమయాల్లో అసభ్యమైన వేషధారణకు కూడా దిగజారిపోయే అవకాశం ఉంది. అందుచేత ఒకరకంగా ఈ సహవిద్య భారత స్త్రీల మేధస్సుతోపాటు సాధారణ వేషభాషలను కూడా తీర్చి దిద్దుతుందన్న విషయంలో సందేహంలేదు.

ఇక విద్యార్థులు కూడా కనపడిన ప్రతి అమ్మాయినీ గేలిచేస్తారనీ, అసభ్యంగా ప్రవర్తిస్తారని భావించటం పొరపాటు. సూక్ష్మంగా పరిశీలిస్తే సహ విద్యగల కళాశాలల్లో వేషధారణలో కాని, ప్రవర్తనలో కాని ఒకరకమైన ప్రత్యేకత, విశృంఖలతగల బాలికలే విద్యార్థుల విమర్శలకు ఎక్కువగా గురి అవుతూంటారన్న సంగతి స్పష్టమవుతుంది. కాబట్టి విద్యార్థుల చర్యలను గర్హించేముందు బాలికలు తమ కట్టూ బొట్టూను గూర్చి కూడా కొంత స్వయం పరిశీలన చేసికొంటే మంచిది.

ఇంతకుముందు నేను చెప్పినట్లు ప్రత్యేక కళాశాలల్లోని బాలికలు విశృంఖలంగా ఉండటంవల్లనే విద్యార్థులు వారిని వెన్నంటి, వేటాడి వెక్కిరిస్తూంటారు. సహ విద్య గల కళాశాలల్లో సాయంత్రం కాలేజీ అవగానే విద్యార్థినీ విద్యార్థులు ఎవరిదారిన వాళ్లు యిళ్లకుపోతే, బాలికా కళాశాలల ఆవరణ బయట, ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లో రకరకాల యువకులు కనపడుతూంటారు. ఇదంతా చూస్తుంటే యీ బాలికా కళాశాలలు ప్రత్యేకించి యిలాటి అవాంఛనీయమైన సంఘటనలకు దారి తీస్తుంటాయని స్పష్టంగా తెలుస్తూంది.

విద్యార్థులొక స్త్రీని అవమానించేరంటే ఆమెమీద ఒక రకమైన చులకన భావమో, నిర్లక్ష్యమో ఉన్నప్పుడే అలా చెయ్యగలరు. తన తోటి విద్యార్థులకు అలాటిభావాలు కలిగే అవకాశాలు యెన్నడూ కాలికలివ్వరాదు.

ఇంతేకాక సహవిద్య ఉన్న కళాశాలల్లో యువతీయువకులు పరస్పరం సానుభూతితో అర్థం చేసికోవటానికి తగినంత అవకాశం ఉంది. విద్యావంతుడైన ప్రతి పురుషుడూ సాధారణంగా విద్యావతియైన భార్యనే కోరుకుంటాడు. అలాటప్పుడు వివాహానంతరం చదువుకున్న తన భార్య అభిరుచులను, ప్రవర్తనను అర్థం చేసికోవాలంటే స్త్రీని గూర్చిన పూర్వపు పరిజ్ఞానం కూడా కొంత అవసరం. సహ విద్యగల కళాశాల్లో స్త్రీ పురుషులు కొంతవరకైనా కలిసి మెలిసి ఉండటం వలన వివాహానంతరం అలాటి వ్యక్తులను గూర్చి తెలుసుకోవటం మరింత సులభమవుతుంది.

స్త్రీ కూడా భార్యగా, తల్లిగా ఒక పురుషుడి జీవితాన్ని తీర్చి దిద్దాలంటే కేవలం పుస్తక పరిజ్ఞాన మొక్కటే చాలదు. చిన్నతనం నుండి తన వయసులోని పురుషులతో కలిసి ఉండటం వలన వారిలోని మంచి చెడులను అర్థం చేసికొనే వివేకాన్ని పెంపొందించుకోగలదు. కాబట్టి యే రకంగా చూసినా సహ విద్య యువతీ యువకుల మనోవికాసానికి ఉపయోగపడుతుందే తప్ప ఎన్నటికీ అనర్థదాయకం కాజాలదు. ●



# అనల్ హక్ — ! అనల్ హక్ — !!

'అనల్ హక్క్! అనల్ హక్క్!' అని అరిచాడు ఆ విద్యార్థి. ఉపాధ్యాయుడికీ, తక్కిన విద్యార్థులకీ కోపం వచ్చింది. అసలే అది ఈశ్వరజ్ఞాన విద్య పాఠం జరుగుతున్న సమయం. ఉపాధ్యాయుడు హజరత్ ఉమర్ శాస్త్రిలో పేరుపొందిన పండితుడు విద్యార్థి మాన్సూర్—ఇ—హల్లాజ్‌కి ఆవేశం వచ్చినప్పుడల్లా ఇలా 'అనల్ హక్క్!' (నేనే సత్యాన్ని!) అని అరిచేవాడు. దీనిని గురించి హజరత్ అతన్ని ఎన్నోసార్లు హెచ్చరించాడు కూడా. తన పాఠశాలలో ఇటువంటి మాటలు ఉచ్చరించవద్దని శాసించాడు. కాని, ఆవేశం వస్తే మాన్సూర్‌ని ఆపటం కష్టం.

పై సంఘటన రాత్రి జరిగింది. మర్నాడు మవుల్వీ హజరత్ ఉమర్ తన ప్రియశిష్యుడయిన మాన్సూర్‌ని పాఠశాల నుంచి పంపించి వేశాడు. ఈ నిర్ణయం అతనికి చాలా బాధ కలిగించింది.

మాన్సూర్ కోపం తెచ్చుకోలేదు. గురువు దగ్గర సవినయంగా సెలవు తీసుకున్నాడు. బాస్రా నుంచి బాగ్దాద్ వెళ్ళాడు. అక్కడ హజరత్ జునాయిద్ అనే మవుల్వీ దగ్గర చేరాడు. బాగ్దాద్‌లో ఉన్న కాలంలోనే మాన్సూర్ 'ఇర్షాదాలత్ — ఇ — షయిక్ ఇబ్రహీమ్' అనే గ్రంథం రాశాడు. ఇందులో దైవస్వరూపాలని గురించి చిన్న చిన్న సూక్తులలో రాశాడు. షయిక్ ఇబ్రహీమ్ అనే పేరు సుప్రసిద్ధమయి పోయింది.

మాన్సూర్ జన్మస్థలం ఇరాన్‌లోని బయిజా అనే గ్రామం. అతని విద్యాభ్యాసం కొంత ధుష్టార్ అనే చోట జరిగింది. ఈ కాలంలో అతనికి సూఫీ సిద్ధాంతాలపట్ల అభిమానం కలిగింది. తీవ్ర 'మతావేశం,' దైవమంటే భయం, ప్రవృత్తి ఇవి సూఫీ సిద్ధాంతాలలో ముఖ్యమయినవి. సూఫీలు ఎంతో నిరాడంబరంగా బతికేవారు. తమ సిద్ధాంతాన్ని వారు 'రిదా' అని వర్ణించేవారు.

బాగ్దాద్‌లో స్థిరపడిపోయిన మాన్సూర్ సిద్ధాంతాలు అక్కడి 'ఉలేమా'కి నచ్చలేదు. పెద్దలు కొందరు ప్రధానమంత్రి దగ్గరికి వెళ్ళి అతనిచేత మరణశిక్ష వేయించారు. శిక్ష అమలు జరిపే ముందు 'ఖలీఫా'కి వెళ్ళవలసి వచ్చింది. అతను దానిని ఆమోదించలేదు. మాన్సూర్ గురువు అయిన హజరత్ జునాయిద్ దానిని ఆమోదిస్తే కాని తను ఆమోదించలేనన్నాడు. 'ఫత్వా' (శిక్షాపత్రం) జునాయిద్ దగ్గరికి ఆరుసార్లు పంపించినా అతను ఏదో ఒక వంక పెట్టి తన ఆమోదనా ముద్ర లేకుండా తిప్పిపంపించివేశాడు. ఏడవసారి ఖలీఫా అడిగాడు 'మీ అభిప్రాయం ఏదో స్పష్టంగా తెలుపవలసింది,' అని.

హజరత్ జునాయిద చివరికి శిక్షని ఆమోదించవలసివచ్చింది. 'షరీయత్ ప్రకారం మాన్సూర్ మరణశిక్షకి అర్హుడు; కాని, సూఫీ సిద్ధాంతాల ప్రకారం భగవంతుడికే అంతా తెలును!' అన్నాడు.

హిజ్రీ సంవత్సరం 309లో మాన్సూర్‌కి మరణశిక్ష విధించారు. అతని కాళ్ళు, చేతుల్ని ఊడపీకి యూఫ్రెటిస్ నదిలో పారవేశారు.

నది అలలో నుంచి 'అనల్ హక్క్! అనల్ హక్క్!' అనే మాటలు వినిపించాయని ఇప్పుడూ చెప్పుకుంటారు. —ఎస్.

# తాతలు, అమ్మమ్మలు, నాయనమ్మలు

మనవళ్ళని, మనవరాళ్ళనీ పెద్దవారు ముద్దుచేసి చెడగొడ్తారంటారు. ఇది కొంత కొంతవరకూ నిజమే అయినా ఇటీవల చికాగో విశ్వవిద్యాలయంవారు చేసిన పరిశోధనలవల్ల కొన్నిసంగతులు తెలిశాయి. వాటి సారాంశం—

1. కొందరు పెద్దవారు తమ పిల్లల పిల్లలకి అప్పుడప్పుడూ చిరుతిండ్లు వగయిరాలు కొనిపెడ్తూ ఉంటారు. షికార్లు తీసుకుపోతూ ఉంటారు. ఇంతకన్నా పెద్ద బాధ్యతలు తీసుకోరు. అంతా పిల్లల తల్లిదండ్రులకే వదిలివేస్తారు.

2. చిన్నపిల్లల క్రమశిక్షణ గురించి అసలే పట్టించుకోరు. వారితోపాటు చిన్నపిల్లలయిపోతారు.

3. మరికొందరు పెద్దవారు పిల్లల తల్లిదండ్రుల బాధ్యతని ఇంచుమించు పూర్తిగా తామే తీసుకుంటారు ఇది సాధారణంగా అమ్మమ్మ, నాయనమ్మలే చేస్తూ ఉంటారు, తాతయ్యలకన్నా. అమెరికాలో మూడుతరాలవారు కలిసి నివసిస్తున్నప్పుడు ఇది జరుగుతూ ఉంటుంది. తల్లి పనిచేస్తున్నప్పుడు ఆమె తల్లిగాని అత్తగారుగాని పిల్లలని చూసుకుంటూ ఉంటారు.

4. ఇక కుటుంబం మంచి చెడ్డల విషయంలో సలహా ఇచ్చేది తాత. అనుభవం ఎక్కువ కాబట్టి సలహాదారుడి పాత్ర తేలికగానే నిర్వహిస్తాడు, కొడుకూ—కోడలికి గాని, కూతురూ—అల్లుడికిగాని ఇది చిరాకు కలిగించదు.

5. మొదట చెప్పినపాత్ర పరాపరి—ఏ పండుగనాడో వచ్చి పిల్లలకి బహుమతులు పంచి మాయమవుతూ ఉంటారు పెద్దవారు.

ఇవన్నీ ఇలా ఉండగా ఎందరో మనవారు తాము తమ పిల్లల పిల్లలకి తగినంత దగ్గరగా ఉండటంలేదని అనుమానపడ్తారని పై పరిశోధనలు తెలుపుతాయి. (కొన్ని సమయాలలో అమ్మమ్మల, నాయనమ్మల దైహికపరిస్థితి కూడా మారుతూ ఉంటుందిట చిన్న పిల్లల సాంగత్యం, పోషణ వల్ల;) కొందరు తాతయ్యలు తమకి తాతయ్యలనుకోనటం కష్టంగాఉందంటారుట.

తల్లిదండ్రులంటే ఉన్నంత ప్రేమ వారి పయితరం వారంటే ఉండదు చిన్నపిల్లలకి. ఇది ఒక విధంగా మంచిది. తల్లిదండ్రుల, పిల్లలమధ్య వచ్చే 'మానసిక సమస్య'ల పరిష్కారానికి తాతయ్యలు, నాయనమ్మలు, అమ్మమ్మలు తోడ్పడవచ్చు. అదీకాక వీరికి తీరిక కూడా ఎక్కువగానే ఉంటుంది

'ఏది ఎలా ఉన్నా మనకి మనపిల్లలకీ కుదిరినప్పుడే కదా వారి పిల్లలకి మనం దగ్గర అవుతాము! అది చాలా ముఖ్యం.' అన్నాడు ఒక 'నిపుణుడు' చార్లెస్ బ్లాక్‌బర్న్. ఈయన కుటుంబ వ్యవహారాలవిషాద సలహా ఇచ్చే ఒకసంస్థలో పనిచేస్తాడు.

ఒక కుటుంబంలో మొట్టమొదటి సంతానంపట్ల అతి వాత్సల్యం చూపించకుండా జాగ్రత్తపడాలి ఆ కుటుంబం పెద్దలు. ఎప్పుడూ అసలు బాధ్యత తల్లిదండ్రులకే వదిలివెయ్యాలి.

—డా. జాయిస్ బ్రదర్స్ (ఇవ్‌షా)

# ఫాస్ఫోమిన్, శక్తిని పెంపొందించును, ఆకలిని అధికముచేయును, సహనశక్తిని హెచ్చించును. శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువచేయును










అవును —
కుటుంబము అంతటికి ఫాస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫాస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫాస్ఫేటులుగల అనువచ్చిన పండ్ల రుచిగల టానిక్

SQUIBB® ® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు చిహ్నాలు. వీరి లైసెన్సు ఉపయోగదారులు సారాభాయ్ కెమికల్స్ ప్రైవేట్ లిమిటెడ్.

SARABHAI CHEMICALS

shilpi sc 49/67 Tel

# వారఫలం

**24-11-67 శుక్రవారం మొదలు**
**30-11-67 గురువారం వరకు**

**మేషం:** వ్యాపారంలో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించవు. వృత్తిలో పోటీదారులతో పోటీ యేర్పడుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగ ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయిగాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభదాయకంగ ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో ముగింపుమాటలు తగవు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగ ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** వ్యాపారంలో ప్రయోజనం గల సంబాషణలను జరుపగలరు. సమయానికి యేదో ఒక విధంగ డబ్బు చేతికి వస్తుంది. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. కోర్టు వ్యవహారాలు అనుకూలంగ ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగ ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సింహం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య:** వారం ప్రారంభంలోనే అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో సహాయావకాశాలు లభిస్తాయి. సాంఘిక కార్యక్రమాల ప్రోత్సాహకరంగ ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగాఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**తుల:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగ నెరవేరతాయి ఆర్థికవ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ వాలాకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగ ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగ ఉంటుంది. సంతానసౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో అనుకోని చిక్కులకు గురికాగలరు. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** ఫలితంసమాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతిపని సులువుగా నెరవేరుతుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— వ్యక్తి అనారోగ్యం చేస్తుంది. నూతన వివరయోగాలను పొందుతారు.

**మీనం:** వృత్తివ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. నూతన వ్యవహారాలు శ్రమమీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సాటివారిలో గౌరవం బాగ ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో ముగింపుమాటలు తగవు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

— మహేష్

అస్తమానం మతిమరుపు మతిమరుపు అంటావ్ - నాకంత మతిమరుపు లేదులే" — రెండు మీటర్ల కిరసనాయిలూ మూడు లీటర్ల దిండుకవరు గుడ్డా, అంతేగా—



సీరియల్



కె. రామలక్ష్మి

**జరిగిన కథ**

కళ్యాణి సుదర్శనంగారి హాస్పిటల్లో డాక్టరు. [illegible] ఆమెకు సంతకాల గొడవే వచ్చింది. మతి చాంచల్యంతో ఒక పిల్లవాడ్ని హత్య చేసిందన్న నేరారోపణమై, పోలీసు ఉద్యోగి ఒకామెను కళ్యాణివద్దకు తీసుకొచ్చాడు. కళ్యాణి ఆమెని పరీక్షించింది. ఆమె పేరు సరళ. చేతులో గుడ్డలమూటని పసిబిడ్డలా కాపాడుకుంటోంది! కళ్యాణి ఆమెమీద ఎంతో జాలిపడింది. స్నేహితురాలు లాయరు శాంత సహాయాన్ని కోరింది. సర్వాదు ఇద్దరూ కలిసి సరళని చూట్టానికి పిచ్చాసుపత్రికి వెళ్లారు. కాని సరళ దగ్గర్నుంచి ఎక్కువ వివరాలు సేకరించలేకపోయారు. శాంత ఆమె తరఫున కోర్టులో వాదించడానికి వకాల్తా పుచ్చుకుంటుంది. సరళ చెప్పిన సంతుర్ని విచారించడానికి స్నేహితురాళ్లిద్దరూ మరికొంతమంది కలిసి వల్లూరు వెళ్లారు.

## 4

[illegible] ఇల్లు చాలా ఎత్తుగా కట్టారు. ఓ పది మెట్లు ఎక్కితేగాని గుమ్మం రాదు. ఆ గుమ్మం దాటగానే ఇల్లు లేదు. కాంపౌండు ఉంది. ఇల్లు బాగా లోపలికి ఉంది. ఇల్లు చూడ్డానికి ఎంత గంభీరంగా ఉందో అంత దిక్కూ దివాణం లేనట్టు ఉంది. అసలు మనిషి అలికిడే లేదు. తలుపు తట్టబోతూ ఒకరి ముఖాకలొకరు చూసుకున్నారు.

'పరవాలేదు పిలు' అంది శాంత.

ఇంకా పిలవకుండానే తలుపు తెరిచారు ఎవరో.

'ఏమండీ లోపలికి రావచ్చా?' అడిగింది శాంత.

తలుపు చాటునుంచి వచ్చింది సమాధానం 'రండి' అని. ముందు గదిలో పాతకాలం బల్లలు కుర్చీలు ఉన్నాయి. గోడకి గంటల గడియారం ఉంది. పక్కగది గుమ్మానికి పూసల తెర ఉంది.

'మేం ఈ ఊరు చూడాలని వచ్చాం. కోవెల ఎటుందో తెలియలేదు.' అంది ఉపోద్ఘాతంగా కళ్యాణి.

'ఇప్పుడక్కడేం ఉంది. ఏం లేదు' అంది ముభావంగా. అప్పుడే ఆ వ్యక్తికేసి చూసింది శాంత.

నిండుగా ఉన్న స్త్రీ. పచ్చని శరీరం. కాని చాలా మాసిన బట్ట కట్టుకుంది.

'ఈ ఇల్లు మీదేనా?' సంభాషణలోకి దింపాలన్న కుతూహలంతో.

'మాదే' క్లుప్తంగా బదులు చెప్పింది ఇల్లాలు.

అక్కడ వున్న కుర్చీలమీద అంతా సర్దుకుని కూర్చున్నారు.

'కోవెలలో ఇప్పుడేం జరగడంలేదు, ఊళ్లోవాళ్లే భక్తికొద్దీ అడపాతడపా సాయంత్రం పూట దీపం పెడుతూ ఉంటారు.'

'అయితే ఆ కోవెలకి ధర్మకర్త ఉన్నారన్నారే' అంది కళ్యాణి.

'లేకేం ఉన్నారు. బాగా పెద్దవారైపోయారు. మనవలు రాజ్యం ఏలుతున్నారమ్మాయి. అంచేత వాళ్లు ఆడింది ఆట. పాడింది పాటగా సాగుతూంది.' నిస్పృహగా అందావిడ.

చూడ్డానికి ఎలాగో ఉన్నా చాలా సంస్కారం ఉన్న మనిషిలా కనబడుతోంది.

'ఓడలు బళ్లూ బళ్లు ఓడలూ అవడం మామూలేగా. ముసలాయన భక్తి కొద్దీ కోవెల కట్టించాడు. దానికి భూమి పుట్రా రాసిచ్చాడు. కాని మనవలు పెద్దవాళ్లయ్యాక ఇవేం కుదరవని కోర్టుకీడ్చి నానా గొడవా చేశారు.'

'ముసలాయన ఊరుకున్నారా?' అడిగింది కళ్యాణి.

'ఏం చేస్తాడు ఊరుకోక. మనవల రాక్షసత్వం చూస్తూ బ్రతకమని రాసి పెట్టినట్టున్నాడు భగవంతుడు.'

'ఆ నరసింహంగారిని మేం చూడాలనుకుంటున్నాం. ఈ టైములో వెడితేనేం?' అడిగింది శాంత.

'ఎప్పుడు వెళ్లినా పరవాలేదు. ఆ బ్రాహ్మడలా వెనకవైపు వసారాలో పడుకుని ఉంటాడు!' అందావిడ.

'మేం వారితో మాట్లాడి కోవెల చూసి వెడతాం. ఏమంటే ఈ ఊళ్లో పంతులు అనే ఆయన ఉన్నాట్ట. మీ కేమైనా తెలుసా?' చివరికి అడిగింది శాంత.

'తెలియకేం అతగాణ్ణి గురించి ఈ ఊళ్లో చెట్టుకీ పుట్టకీ కూడా తెలుసు' అంది ఆమె కంఠంలో ఒక రకమైన మార్పు ధ్వనించింది. అది వెటకారమో, వేదనో

తెలియలేదు.

'వారితో కూడా మాకు కొంచెం పని ఉంది. ఎక్కడుంటారాయన?' అడిగింది శాంత.

'సాధారణంగా పొద్దుటే బయలుదేరి తుని వెళ్లిపోతాడు. రాత్రి ఏడు ప్రాంతాలలో తిరిగి వస్తాడు. మరా ఊళ్లో ఏం రాచకార్యాలు వెలగబెడతాడో ఎవరికీ తెలియదు. ఎవరూ పట్టించుకోరు కూడా' అందావిడ.

'పోనీ సాయంత్రం ఏడుగంటలకైనా ఎక్కడ దొరుకుతారు?'

'ఎక్కడికీ వెళ్లడాయన. కోవెల వెనకనే పూజారికని రెండు గదుల పాకొకటి ఉంది. అక్కడే ఆయన మకాం.'

'అదేమిటి? నరసింహంగారికీ ఈ పంతులకి ఏమైనా చుట్టరికం ఉందా?' ఆత్రంగా అడిగింది కళ్యాణి.

'అబ్బే చుట్టరికం ఏంలేదు. చిట్టి పంతులుకి వారిదగ్గిర బాగా చనువు వారి మనవరాలిని చేసుకుంటాడని కూడా అనుకునేవారు' అందావిడ.

'మీ కెవరూ ఇంట్లో సాయంలేనట్టుంది' అంది యథాలాపంగా శాంత.

'నాకు సాయం ఎందుకమ్మా. నే నీ గడప దిగితే ఈ యిల్లూ గట్రా అమ్మేసి రామచంద్రపురం వెళ్లిపోవాలని చూస్తున్నాడు నా తమ్ముడు. మా వారు, వద్దు మొర్రో మంటున్నా నన్నేదో ఆదుకుంటాడని వాడికి రాశారు ఆస్తి. ఆస్తిమీద వున్న అభిమానం అక్కగారి మీదా ఎలా ఉంటుంది చెప్పండి?' అంది జాలిగా నవ్వుతూ.

ఆ నవ్వులో కనబడిన నిస్సహాయత శాంతని కూడా కదలించివేసింది.

'పోనీ మీరు అక్కడే హాయిగా ఉండవచ్చునేమో ఆలోచించారా?'

'ఆలోచన కేముందమ్మా అది నా పుట్టిన వూరు. కాని ఇలా అక్కడికి వెడితే నన్ను ఆదరించే వాళ్లెవరు? బండెడు నగలతో హుందాగా బ్రతికినప్పుడు వాళ్లు నా యింటికే వచ్చారు. ఇప్పుడు నడుం విరిగి దానలేక బ్రతుకుతున్న నేను వాళ్లింటికి ఎలా వెడతాను? నా కష్టం ఇక్కడే పోవాలి.'

దృఢంగా అందావిడ.

పోయిన సిరిసంపదల చిహ్నంలాగా ఉన్న ఆ యిల్లులాగే ఉంది ఇల్లాలు కూడా అనుకుంది శాంత.

'మేం నరసింహంగారిని చూసివస్తాం. సాయంత్రందాకా అటూ ఇటూ తిరిగి పంతులుని చూసివెడతాం. అప్పటిదాకా మేం కోవెల ఆవరణలో ఉండవచ్చునా?' అడిగింది ఎందుకైనా మంచిదని కళ్యాణి.

'వెళ్లండమ్మా. దానికేం యిబ్బంది హాయిగా ఉండొచ్చు'నంటూ వారివెంట వాకిలి దాకావచ్చిందావిడ.

'వెళ్లి వస్తాం' అంటూ మెట్లు దిగడం ప్రారంభించారు. వీధి తలుపు గడియవేసుకుంది ఆ యిల్లాలు.

'పాపం, చాలా బాగా బ్రతికి చాలా దారుణంగా చితికిపోయింది కాబోలు' అంది కళ్యాణి.

'అంతే కొందరి బ్రతుకులు. తల్లితోడూ కూడా కాటువేయాలని చూస్తే ఇంకో దారి ఏముంటుంది?' అంది కళ్యాణి.

నరసింహంగారి ఇంటికి మెట్లు [illegible]. వారి



# ఆడది

వీధి తలుపులు బార్లా తెరచి ఉన్నాయి. లోపల నుంచి ఏ మాత్రం అలికిడీ విన రావడం లేదు. నల్లురూ లోపలికి నడిచారు.

ఎదురింటి ఇల్లాలు చెప్పినట్టు వెనక వక్క వరండాలో ఉండే మనిషికోసం చూస్తూ ముందుకి నడిచారు.

అలాగ్గానే వరండాలో ఆపాదమస్తకం దుప్పటి కప్పుకుని పడుకుని ఉన్నారెవరో. బహుశా ఆయనే నరసింహంగారు కావచ్చు.

'ఏమండీ' నెమ్మదిగా పిలిచింది కళ్యాణి.

దుప్పటి ముఖం మీాద నుంచి తొలగిస్తూ లేచి కూర్చున్నారాయన.

'నమస్కారం. మీారే నరసింహంగారు. అవునా?' చనువుగా అంది కళ్యాణి.

'బాగా చెప్పావమ్మా నేనే నరసింహాన్ని రండి కూర్చోండి.' అంటూ వరండా చూపెట్టారాయన.

అంతా కూర్చున్నారు.

రెండు నిముషాలసేపు నిశ్శబ్దం తాండవించింది.

'ఇంతకీ నన్ను వెతుక్కుంటూ వచ్చారు. మీారెవరు?' అడిగారాయన.

ఆయన కంఠం గంభీరంగా ఉంది.

ఆయన నిజంగా నరసింహంలాగా ఉన్నారు. సన్నగా ఉన్న నడుం మీాద ఛాతీ విశాలంగా కన్పిస్తుంది. జబ్బలు కండ వాలినా బలిష్ఠంగా కనబడుతున్నాయి. నోటిలో ఒక్క పన్నులేక పోయినా మాట మామూలుగా ఉంది. పండిన జుట్టు సన్నంగా పరుచుకుంది తలమీాద. మాట్లాడుతూ తలరాసుకోవడం ఓ అలవాటులా ఉంది ఆయనకి.

'మేం వైజాగ్ నుంచి వస్తున్నాం తాతగారూ, ఈ ఊళ్లో కోవెల చూద్దామనుకున్నాం. మర్రిచెట్టు దగ్గర ఓ పెద్ద మనిషి మిమ్మల్ని కలవమంటే ఇలా వచ్చాం' అంది కళ్యాణి. కళ్యాణికీ శాంతకీ కూడా తాతగారు చూడగానే నచ్చారు. గంభీరమైన ముసలివాళ్లు నిజంగా కుతూహలాన్ని రేకెత్తిస్తారు!

'గుడి ఏమంత గొప్పది కాదమ్మా. ఏదో సంసారపక్షమైనదే. పెద్ద శిల్పాలూ గట్రా కూడా లేవు' అన్నారు నరసింహంగారు.

ఆయన ధోరణిలో 'పల్లెకి వచ్చి ముంత దాచుకున్నారు' అన్నది గోచరమవుతూనే ఉంది.

'అదొక్కటే పనిమీాద రాలేదు. మేం ఈ ఊళ్లో పంతులు అనే ఆయనని కలుసుకోవాలని కూడా వచ్చాం' అంది శాంత.

ఓ క్షణం గంభీర ముద్ర దాల్చారు నరసింహంగారు.

'ఏం పనో తెలుసుకోవచ్చా?' అడిగారు.

'తప్పకుండాను మీాలాంటి పెద్దలదగ్గిర దాచడం దేనికి? వారి గురించి మీా అభిప్రాయం ఏమిటి?' అడిగింది శాంత.

ఎందుకో నరసింహంగారు నవ్వారు. నవ్వుతూనే.

'అమ్మాయి చాలా గట్టిదానివే. అతగాణ్ణి గురించి నా అభిప్రాయం తెలిశాక చెప్తానన్నమాట. సరే, పంతులు చాలా మంచి కుర్రాడు. బాగా చదువుకున్నవాడు. ఏ పూరయినా వెళ్లి ఉద్యోగం చెయ్యడు. ఈ ఊరుకీ అతనికీ అంత అనుబంధం ఉంది. అతగాణ్ణి చూస్తే అనిపిస్తుంది చదువుకున్నవాళ్లు కూడా మూర్ఖంగా ఉంటారని. లేకుంటే ఈ పల్లెలో ఏం జీవం ఉంది చెప్పు?' ఆగారు తాతగారు. కళ్యాణి శాంతకేసి రెప్పవాల్చకుండా చూస్తుంది,

'కోర్టులో సాక్ష్యం ఇవ్వడానికి పంతులుగారిని కలుసుకోవాలి' నెమ్మదిగా అంది శాంత.

'కోర్టులోనా? సాక్ష్యమా?' ఆశ్చర్యంగా అడిగారు నరసింహంగారు.

'అవును తాతగారూ, చాలా గమ్మత్తు అయిన కేసొకటి వచ్చింది. అదొక కొలిక్కి తేవాలంటే పంతులు సాక్ష్యం ఎంతైనా అవసరం' వివరించింది శాంత

'పంతులు కోర్టు పక్షికాడే!' తనలో తనుగా అనుకున్నారాయన.

'ఇది చాలా ముఖ్యం. ఆయన చెప్పబోయే దానిమీాద ఒక పిచ్చిదాని భవిష్యత్తు ఆధారపడిఉంది' అంది శాంత

'పిచ్చిదానికి భవిష్యత్తేమిటమ్మా!' నవ్వుతూ అన్నారు నరసింహంగారు.

'లేదు తాతగారూ ఆ పిచ్చిది పరిస్థితుల వల్ల అలా అయిందని మా డాక్టరు నమ్మకం. అన్నీ చక్కపడతాయన్న గట్టి నమ్మకం ఉంది. అందుకే ఈ కేసు తీసుకొని మా శాయశక్తులా ఆ పిచ్చిదాని భవిష్యత్తుకో రూపం ఇవ్వాలని నిర్ణయించాం' అంది శాంత.

'ఇంతకీ మీరు డాక్టర్లూ లాయర్లూ వాళ్ళో చెప్పారు కాదేం?'

'ఏంలేదు తాతగారూ, ఇలాంటి పల్లెటూళ్ళలో చదువుకొన్న ఆడపిల్లలని అవహేళన చేస్తారు. అందుకని ముందే చెప్ప లేదు' అంది కళ్యాణి.

'అందుకే కదమ్మా పల్లెటూళ్ళు అసలు బాగుపడడం లేదు. ఎంతో ఉత్సాహంతో ఉద్ధరిద్దామని వస్తున్న యువజనాన్ని తరిమేస్తారు. ఇక్కడివాళ్ల మనస్సులు కూడా పరిసరాల్లాగానే వికృతంగా ఉంటాయి. ఇదేచోట పుట్టి పెద్దవాళ్ళయిన మరెవరూ కూడా ఇక్కడేఉంటే అంతే..'

'మీ వయస్సుకి మీకు చాలా అభ్యుదయ భావాలున్నాయి తాతగారూ,' ప్రశం

'అందుకే కదమ్మా ఇలా ఉన్నాను!' అన్నారాయన నవ్వుతూ.

'ఇంతకీ పంతులు ఎక్కడ దొరుకుతాడో?'

'సాయంత్రందాకా రాడు. తుని కోర్టు దగ్గర, పోస్టాఫీసుదగ్గర, కోర్టుల్లోనూ, ఎవరికేనా ఏదైనా రాసిపెట్టే పని ఉంటే అవన్నీ చూసుకుంటూ పొద్దు పోగానే వస్తాడు. అప్పటిదాకా ఉండగలరా?' అడిగారాయన.

'మేం కోవెలలో ఉంటాం. ఉండవచ్చుగా?' అడిగింది కళ్యాణి.

'మరి మీ భోజనం?'

'మేం తెచ్చుకున్నాం. అక్కడే తినేస్తాం లెండి' అంది శాంత.

'మంచిపని చేశారు. లేకుంటే ఇబ్బందే' అన్నారు మెల్లిగా.

'మీకా మనుమలూ ఎవరూ లేనట్టుంది?' అడిగింది కళ్యాణి.

'అంతా కోర్టు వేతుబుగా తయారయ్యారమ్మా. అంతా నా రాత. ఒక్కొక్క సెంటు డొప్పున తిరిగి రాబట్టే ప్రయత్నాలలో ఉంటారెప్పుడూ.'

'మరి మీ భోజనం?' అడిగింది శాంత

'నే ఒక్కపూట తింటాను. అదీ రాత్రి పూట.'

'ఎలా ఉండగలుగుతున్నారండీ?, ఆశ్చర్యంగా అడిగింది కళ్యాణి.

# ఆదివి

'అలవాటు' ముక్తసరిగా సమాధానం చెప్పారాయన.

'చాలా కాలం నుంచి ఇంతేనా?'

'ఆ దరిదాపు అర్ధశతాబ్దం నుంచి' ఏదో విన్నా మున్నా అన్నట్టు నరసింహంగారి కేసి వింతగా చూసింది కళ్యాణి.

'నేను ఆరోజుల్లో కాశీ నడిచి వెళ్ళి వచ్చాను. అప్పుడే ఈ అన్నపూర్ణని ప్రతిష్ఠకని తీసుకు వచ్చాను.'

'ఇప్పుడు మీ వయస్సెంతండి తాతగారూ?' కుతూహలంగా అడిగింది శాంత.

'ఎనభై పైచిలుకు' అన్నారాయన — కాళ్ళమీద దుప్పటి సర్దుకుంటూ.

'మిమ్మల్ని చూస్తే ఎవరూ అలా అనుకోరు.' అంది కళ్యాణి.

'మేం వెళ్ళి వస్తాం. వీలుంటే మళ్ళీ కలుస్తాం' అంటూ లేచింది శాంత.

'అలాగేనమ్మా' అంటూ యథాప్రకారం దుప్పటి ముసుగు తన్నే ప్రయత్నం ప్రారంభించారు నరసింహంగారు. వీధిలోకి నడిచారు శాంతా అందరూ.

'అరె, కోవెల ఎటో అడగనే లేదు.' అంది కళ్యాణి.

'ఇంతోటి పెద్ద ఊరులో కోవెల కనుక్కోలేక పోతామా ఏం!' అంది స్నేహితురాలు.

'ఎన్నాళ్ళు తిరిగి ఉంటేంత ఊరంతా చూసి కాయలోని పిక్నిక్ బాస్కెట్ పట్టుకుని గుళ్ళోకి పోదాం.' అంది శాంత.

ఊరు చాలా పాతబడింది.

ఇళ్ళూ వాకిళ్ళూ చాలామటుకు శిథిలాలే. అక్కడా అక్కడా ఒకొక్క ఇంట్లో మనుష్యుల అలికిడి కనబడుతుంది.

పొలాలు మటుకు పచ్చగా కన్నుల పండుగగా ఉన్నాయి.

ఎవరివో ఏమిటో జామతోట, మామిడి తోపు కూడా ఉన్నాయి.

విశ్రాంతిగా తోపులో ప్రవేశించారు.

కాపలా కాస్తున్న వాడు తాను పేను కుంటూ ఓ పొట్టి గుడిసె ముందు కూర్చున్నాడు.

పట్నం అమ్మాయిలని ఇట్టే గుర్తు పట్టేశాడు.

చేతులు నలుపుకుంటూ వెనక వెనక తిరగడం మొదలుపెట్టాడు.

దోర జామకాయలుకోసి యిచ్చాడు.

ఓ అర్ధరూపాయ వాడిచేతిలో పడేసింది శాంత అటు తోటల వెనకనుంచి నడిచి వస్తే ఏటివద్దకి చేరారు. జనసంచారం అంటూ ఉంటే ఏటిదగ్గరే ఉంది. ఏటిలో అక్కడా అక్కడా నీళ్ళు మడుగుల్లాగా ఉన్నాయి. కాని చెలమలు చాలా తవ్వారు. తాటాకు దొప్పలతో చెలమలో నీళ్ళు చేది బిందెలు నింపుతున్నారు కొందరు. ఎండలో తెల్లగా తోమిన బిందెలు బంగారం వాటిలాగా మెరుస్తున్నాయి. కుర్రకారు అంతా అవతలివైపు గుమిగూడి కబుర్లు చెప్పుకుంటున్నారు.

అన్నీ చూస్తూ నడుస్తున్న ఈ నలుగురినీ వింతగా చూస్తున్నారంతా.

అనుకున్నట్టే కోవెల కనుక్కోడం సులువే అయింది. కోవెల వెనకనుంచి ఏటికి దారి ఉంది. కోవెల బాగా ఎత్తునకట్టారు. కాలిబాట మెలికలు తిరుగుతూపోయి పైన చెట్లలో కలిసిపోయింది. ఆ దారి వెంట పైకి ఎక్కడం ప్రారంభించారు. కోవెల వెనక చిన్న పెరటి తలుపుంది. అది తెరిచే ఉంది. తెరిచి లేకపోయినా పక్కగోడ అంత ఎత్తు లేదు! కోవెలలోకి ప్రవేశించారు.

(ఇంకా ఉంది).



**గార్డన్ వింటర్**

# అయిదేళ్ల గృహనిర్బంధం

ఈ వ్యాసరచయిత శ్రీమతి హెలెన్ జోసఫ్‌తో ఆమెని ఎరెస్టు చేసినరోజు మాట్లాడాడు. పోయినయేడు దక్షిణ ఆఫ్రికాని వదిలి వెళ్లి వచ్చేసినప్పుడు మరొకసారి మాట్లాడాడు

ఆవిడ పేరు హెలెన్ జోసఫ్ ఆవిడ వయస్సు 62 ఆవిడ ఉండేది జోహాన్స్‌బర్గ్ శ్రీమతి జోసఫ్ ప్రతిరోజూ, ఒంటరిగా భోజనం చేస్తుంది. ఇది గత అయిదు యేళ్ళుగా జరుగుతున్న పని. దీనికి కారణం ఏమిటి?

దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం ఆమెని ఈ విధంగా శిక్షించింది ఆమెని ఎవరూ వెళ్లి చూడటానికి వీలులేదు. అంతేకాదు, ప్రతి రోజూ ఆమె పన్నెండుగంటలయినా యింటిలోనే గడపాలి – ఒంటరిగా

హెలెన్. జోసఫ్ ఇంగ్లీషు వనిత ఆవిడ 'దక్షిణ ఆఫ్రికాలో అమలులోవున్న జాతివివక్షణావట్టం 'అపార్తెయిడ్'ని ఎదిరించింది అందుచేతనే ఆమెకి ఈ శిక్ష పడింది ఈ శిక్ష అక్టోబర్ 13, 1962 లో విధించింది ప్రభుత్వం. ఇటువంటి ఆర్డరు పడటం, దక్షిణ ఆఫ్రికాలో అదే మొదటిసారి ప్రతిదినం ఉదయం 6–30 కి ఆమె ఇల్లు వదిలి తన కార్యాలయానికి వెళ్తుంది. ఆవిడ 'శ్వేతేతరుల శ్రేయోసంఘం ఒకదానిలో పనిచేస్తుంది శ్రీమతి జోసఫ్ మళ్లీ సాయంత్రం 6-30 లోపల ఇంటికి తిరిగి వచ్చివెయ్యాలి – మధ్యాహ్నం విరామ సమయంలో ఆవిడ కొంచెం దూరంగా వున్న పోలీసుస్టేషన్‌లో స్వయంగా హాజరుకావాలి ఏ ఒక్కరోజు వెళ్ళకపోయినా కనీసం ఆవిడ ఒక సంవత్సరం కారాగృహనిర్బంధం ఎదుర్కొనవచ్చు

హెలెన్‌జోసఫ్‌కి ఒక పాత ఫ్రెంచి కారు ఉంది దానితో ఇంటికి తిరిగి వెడుతూ వుంటే ఎప్పుడు అది ఏమివచ్చి ఆగిపోతుందో అని ఆవిడ భయపడుతూ వుంటుంది. అలాగైనా ఇంటికి వెడితే ఎటువంటి పొరపాటో గుర్తించరు అధికారులు.

హెలెన్‌జోసఫ్ శనివారాలు మధ్యాహ్నం 2–30 దాకా పని చెయ్యవచ్చు ఆది వారాలు ఆమె 24 గంటలు ఒంటరితనం భరించాలి ఇదీ ఆమెకి విధించిన శిక్షలో భాగమే. .

ఆరోగ్యం చెడిపోతే? ప్రభుత్వం-అంటే పోలీసుశాఖ-ఆమోదించిన డాకరు వచ్చి



హెలెన్ జోసఫ్

## సన్‌లైట్ వల్ల ప్రతిమాటూ మీ బట్టలు అతికాంతిగా ఉతుకబడును




సన్‌లైట్ సబ్బును వాడండి, మరి మీరు చూసేదేమనగా... అది సరియైన కాంతిగా ఉతుకుతుంది. సన్‌లైట్ సబ్బువల్ల నిజంగా, ఉతుకుతుకునకూ మీ బట్టలు అతి కాంతిగా వుంటాయి! సన్‌లైట్ సబ్బును కొద్దిగా రుద్దితే దాని [illegible] నురగ వస్తుంది, ఆ నురగయే మీ బట్టలను ఎంతో శుభ్రంగాను... ఎంతో కాంతిగాను వుంచుతుంది. మీ బట్టలు అన్నిటిని సన్‌లైట్ సబ్బుతో ఉతకండి.

**మీరు రోజూ ఉపయోగించే బట్టలను సన్‌లైట్‌తో ఉతకండి**

లింటాస్-S.63-140 Tel.

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

ఆమెని చూడవచ్చు.

హెలెన్ జోసఫ్ జోహాన్స్‌బర్గ్‌ని వదిలి వెళ్ళటానికి వీలులేదు; ఏ పాఠశాలల్లోకీ, ఫ్యాక్టరీల్లోకి, విశ్వవిద్యాలయాల్లోకి వెళ్ళరాదు; సమావేశాలకి వెళ్ళటం పనికిరాదు.

దక్షిణ ఆఫ్రికాలో ముగ్గురు ఒకచోట కూడితే అది 'గుంపు' అవుతుంది; శ్రీమతి జోసఫ్ ఏ గుంపులోనూ నుంచోటం, కూర్చోటం చట్టవిరుద్ధం.

ఆవిడ ఇంట్లో ఒక టెలిఫోన్ వుంది. కాని, ఆవిడ తన స్నేహితవర్గంలో ఎవరితోనూ మాట్లాడటానికి వీలులేదు. ఇదీ నేరమే. ఆవిడకే కాక ఆవిడతో మాట్లాడిన వారికీ కారాగృహ వాసం రావచ్చు.

అన్ని సెలవురోజులలోనూ హెలెన్ జోసఫ్ ఇంట్లో ఒంటరిగా ఉండిపోవలసిందే.

ఆవిడకి తోడు ఇప్పుడు ఒక పిల్లి మాత్రమే. దానిపేరు సీత. పోలీసువారెవరు వచ్చినా సీత నడుం వంచి బుస కొట్టటం అలవాటు చేసుకుంది. 'పోలీసు వస్తున్నట్లు ఇదే గుర్తు నాకు! అది బుస కొట్టగానే నేను రాస్తున్న దానిని దాచేస్తూ ఉంటాను,' అని నాతో చెప్పింది శ్రీమతి జోసఫ్.

ప్రతిరాత్రీ హెలెన్ జోసఫ్ రెండుమూడు పుటలు రాసి, మామూలు ఉత్తరాల కింద వాటిని ఇంగ్లండ్‌లో ఆప్తులలో ఒకరికి పోస్టు చేసేది. వీటి సారాంశం ఇంగ్లండ్‌లో 'టుమారోస్ సన్' అనే పేరు కింద ప్రచురితం అయింది.

వెంటనే పోలీసువారి పర్యవేక్షణ అధికం అయింది రహస్యంగా కిటికీలలో నుంచి తొంగి చూడటం మొదలుపెట్టారు. ఈ బాధ నుంచి తప్పించుకోవటానికి హెలెన్ జోసఫ్ ఒక పెద్ద కుక్కని కొనుక్కుంది. పోలీసువారు తాము వచ్చేముందు దానిని కట్టెయ్యమంటూ ఉంటారు.

ఒకనాడు ఎవరో ఆగంతకుడు దారి తెలుసుకోవటం కోసం తలుపుకొట్టాడు. ఎవరూ పలక్కపోతే తిరిగి వెళ్ళిపోతూ ఉండగా పోలీసులు పట్టుకున్నారు. అతను తెల్లజాతివాడు కూడా కాదు. అతికష్టం మీద తను కేవలం ప్రమాదవశాత్తు వెళ్ళానని ఒప్పించ గలిగాడు...

శిక్ష విధించిన రోజు నాతో అన్నది శ్రీమతి జోసఫ్: 'నా జీవితం దుర్భరం

# అయిదేళ్ళ గృహనిర్బంధం

అయిపోయి ఈ దేశం వదిలి వెళ్ళిపోతానని ప్రభుత్వం అనుకుంటోంది కాని, ఈ దేశం స్వతంత్రం అయ్యేదాకా వదలి వెళ్ళను! నేను బెదిరి పారిపోను! ఈ నిర్బంధాన్ని సహిస్తాను!'

ఒకసారి ఒక నల్లజాతి వనిత హెలెన్ జోసఫ్‌ను కావలించుకుని ఒక పూలగుత్తి బహూకరించింది. ఈ దృశ్యం పత్రికలలో పడింది. రెండు రోజుల తర్వాత శ్రీమతి జోసఫ్‌కి ఒక ఉత్తరం వచ్చింది: 'మన ప్రభుత్వం నీ పని పట్టేసరికి నువ్వు కాఫిర్లని కావలించుకోవు! తెల్లజాతి మహిళాలోకానికే సిగ్గుచేటు నువ్వు! నిన్ను కాల్చి చంపెయ్యాలి! డబ్ల్యు. ఎస్. జెఫ్రీవాలు — ప్రభుత్వ విధానాన్ని 100 శాతం బలపరిచే వ్యక్తి.'

అసలు హెలెన్ జోసఫ్‌ని ఎందుకు నిర్బంధించారు? ఎందుకు ఆమె కేసుని కోర్టుకి కూడా వెళ్ళనివ్వలేదు? ఈవిడ 1931లో దక్షిణ ఆఫ్రికాకి వచ్చింది. మొదటి నుంచీ శ్వేతేతర జాతివారి కోసం ఎంతో కృషి చేసింది. 1956 'దేశద్రోహ విచారణ'లో ఈమెని కూడా నిర్బంధించారు. నాలుగేళ్ల విచారణ తర్వాత కోర్టువారు ముద్దాయిలు అందరినీ నిర్దోషులన్నారు.

ఏప్రెల్ 1962 ఆమె 8000మయిళ్ళ పర్యటన చేసి, 38 మంది బహిష్కరింపబడిన వ్యక్తులని చూసి పరామర్శించింది. వీరందరూ ప్రభుత్వ విధానాల వల్ల బాధలకి లోనయినవారే. ఈ పని 'హ్యూమన్ రయిట్స్ వెల్‌ఫేర్ కమిటీ' తరఫున చేసింది ఈ పర్యటనని ఆమె 'జీవన్మృతుల వద్దకి ప్రయాణం' అన్నది.

ఆమె కమ్యూనిస్టు అన్నది ప్రభుత్వం. శ్రీమతి జోసఫ్ తను కమ్యూనిస్టు కాదని సమాధానం ఇచ్చింది.

ఈ సమాధానం దక్షిణ ఆఫ్రికా పత్రికలలో పడటానికి వీలులేదు. అక్కడ చట్టం అలా ఉంది.

(పో. వ. ఫీ. కాపీరయిటు)





# ఏముంది నాకు?

కొలకలూరి

నా కప్పుడు ఇరవై ఏళ్లు చిన్నక్కయ్యకు మొదటి సంతానం, కూతురు పుట్టిందంటే ఎంతో సంతోషం కలిగింది. ఎందుకో మొదట్నుంచి నాకు ఆడవాళ్లంటే ఉన్నంత వాత్సల్యం మగవాళ్లంటే లేదు. అందుక్కారణం నలుగురు అక్కలకు నేనొక్కణ్ణే తమ్ముణ్ణి కావటం కావచ్చు.

[illegible] వెళ్లి పోయి, చిన్నారి పాపాయిని చూచి తిరిగివచ్చి ఆఫీసులో చివాట్లు తిన్నాను.

ఆరోనెలలో రాణి ఎలావుందో చూడాలని పించి వెళ్లాను.

ఎరుపుశరీరం, గుండ్రని కళ్లు, పాల బుగ్గలు, లేత పెదవులు, బొద్దు శరీరం, ఎంతో అందంగా ఆరోగ్యంగా వుంది రాణి.

[illegible] తలస్నానం చేయించి సాంబ్రాణి పొగవేసి, రాణిని ఉయ్యాలలో పడుకో బెట్టింది అక్క. కాళ్లూ చేతులూ ముఖం దగ్గర పెట్టుకొని బుంగమూతి తెరిచి, చొంగ కార్చుతూ, ఆడుకొంటూ వుంది రాణి.

నేను ఉయ్యాల వూపుతూ కూర్చున్నాను. పాప బాగా ఆడుకొంటూ వుంది. నాకు చెల్లెళ్లు లేరు. అందరూ అక్కలే! రాణి మీద ఎందుకో చాలా ఇష్టం! ఉయ్యాల లోంచి తీసుకొని భుజంమీద వేసుకొన్నాను.

నా చొక్కా చల్లగావుంటే చూశాను. రాణి బట్టలు తడిపింది. పడుకోబెట్టి ఊపుతూ కోపంగా చూస్తే, నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కను రెప్పలు కదిలాయి కళ్లు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా సుతారంగా నవ్వింది రాణి.

* * *

నా కప్పుడు ఇరవై అయిదేళ్లు. రాణికి అయిదేళ్లు! పుట్టినరోజు పండుక్కు అక్క వ్రాస్తే వెళ్లాను.

బర్త్‌డే ప్రెజెంటేషన్‌లు చాలా తీసుకు పోయాను. బొమ్మల పుస్తకాలు, గౌన్లు, స్వీట్లు టిన్నులు. చాలా!

అన్నీ అక్కకిచ్చాను.

'నా కెందుకురా! దానికివ్వు' అంది. రాణి అన్నీ తీసుకొంది. ఆ రోజు నేను తీసుకుపోయిన గౌను వేసింది అక్క!

అయిదేళ్లకే బాగా పెరిగింది.

బొద్దుగా వుంది. ఎన్నో మాటలు, మాటలపుట్ట. నర్సరీ సాంగ్స్ చాలావచ్చు. ఎప్పుడూ ఎగురుతూ వుంటుంది. ఇంగ్లీషూ తెలుగూ చాలా పాటలు ఏక్షన్‌తో నేర్చుకొంది. కాన్వెంట్‌లో ప్రీ బేసిక్ క్లాసు!

ఫేక్టరీ అయినా ఆగుతుంది రాణి నోరు ఆడటం ఆగదు. వాగుడు తప్పితే ఎగురుడు, కాదంటే నోరు! నోట్లో ఏం వేసుకొన్నా మర ఆడించినట్టే! మరు క్షణం నోరు ఖాళీ అయిపోతుంది.

సాయంకాలం హాలులో అందరం కూర్చున్నప్పుడు అక్క రాణితో అంది.

'మామను చేసుకొంటావుటే బాగా చూచుకొంటాడు.'

బిత్తరపోయి దిక్కు తెలియకుండా చూస్తూ అంది.

'ఊఁ మామనా?'

'అవును. ఏం?' అక్క.)

'నా కొడుకు పాడు!' అంటూ నా జుత్తు విడా పెడా చెరిపేసి ఎగురుతూ రాణి వెళ్లిపోబోతుంటే చేయి పట్టుకొన్నాను.

కోపంగా ముఖంలోకి చూస్తే నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి. కళ్లు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా మతా— నవ్వింది.

* * *

రాణి కప్పుడు తొమ్మిదోఏడు!

హైస్కూలులో చేర్చుతున్నాం, రమ్మని వ్రాస్తే వెళ్లాను. తొమ్మిది ఏళ్లలో అక్కయ్యకు మళ్లీ పిల్లలు కలగలేదు.

రాణి గారాలకూతురు. ఆ రోజు ఇల్లంతా చాలా సందడిగా వుంది.

'బావయ్యకు సెలవు దొరకలేదు. దాన్ని నువ్వే స్కూలులో చేర్చి రారా!' అంది, అక్క.

రాణిని స్కూలుకు తీసుకుపోయాను. అడ్మిట్ చేయించాను. మధ్యాహ్నం ఇంటికి వచ్చాను రాణితో. రాణి అందంగా, ఆరోగ్యంగా ఆనందంగా వుంది

అన్నం ముందు కూర్చున్నాను.

అక్క అడిగింది.

'పెళ్లి చేసుకోవేమిరా?'

నే నేమీ మాట్లాడలేదు.

'మాట్లాడవేమిరా?'

'నువ్వే చెయ్యి' అన్నాను నవ్వుతూ,

'అమ్మా నాన్నలు తెచ్చిన సంబంధాలు [illegible]కొన్నావుగా ఇక నేను చెయ్యాలి నీకు' అంటూ నేయి వడ్డించింది.

మరేమీ సంభాషణ సాగలేదు.

సాయంకాలం నోట్‌బుక్స్, టెక్స్టుబుక్స్ పెన్ను కొనితెచ్చాను. రాణి చూస్తూ వుంది. అక్కకిచ్చాను.

రాణికి అక్క పెన్ను ఇస్తూ 'మామయ్య ఇచ్చాడే' అంది.

అటూ ఇటూ చూచి, 'ఛీ ఏం బాగా లేదు' అంది రాణి.

'రాణీ! నిజంగా బాగాలేదా నీకు' అని చేయి పట్టుకొని కోపంగా చూస్తూ అడిగితే నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి, కళ్లు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా మతాబంగా నవ్వింది.

* * *

రాణి కప్పుడు పదమూడేళ్లు. స్కూల్లో ఫోర్తుఫారం చదువుతూ వుంది.

రాణి రజస్వల అయిందని అక్క దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. అమ్మ నాన్న ఉత్తరంలో ఏమేమి తేవాలో వ్రాసి అన్నీ నన్నే తీసుకురమ్మని, అమ్మాయిదగ్గరే కలుసుకొందామనీ వ్రాశారు.

నాకు ఎంతో సంతోషమయింది.

అన్నీ తీసుకొని బయలుదేరాను.

బంధువులతో అమ్మలక్కలతో ఇల్లంతా కళకళలాడుతూ కనులపండుగలాగా వుంది

ఆరోజంతా హడావుడిగా అవసీ ఈవసీ జరుగుతూ వుంది.

సాయంకాలం హాలులో అందరం కూర్చుని వున్నాము. సంభాషణ అనుకోకుండా నావైపు మళ్లింది.

'వాడికి నీ కూతురు అయినా నచ్చుతుందేమో అడగవే' అంది అమ్మ.

'అంతకంటే నాకేంకావాలి. వాడికిష్టమైతే' అంది అక్క.

'ఏమిరా?' అంది అమ్మ.

నవ్వాను. ఎంతో తీపిగా నవ్వివుంటాను. 'రాణి పసిపిల్ల' అన్నాను. లేచి తోటలోకి వచ్చాను.

నేను తెచ్చిన చీరె కట్టుకొని, తోటలోకి వచ్చి పూలు కోస్తూ వుంది రాణి. పూసిన పందిరిలాగా వుంది,

నన్ను చూచి అరిందాలాగా 'ఇక్కడున్నావా మామయ్యా! నన్ను నీకిచ్చి పెళ్లి చేస్తారటగా' అంది.

నవ్వాను.

నాపసానిలా ముంజెంగులు ముంగాళ్ల మీద జీరాడుతూవుంటే చీరె సరిచేసుకొంటూ దగ్గరకు వచ్చింది.

'ఏం?' అన్నాను.

'చీరె ఏం బాగాలేదు మామయ్యా' అంటూ నవ్వింది. జడ చేతికి తగిలింది. పట్టుకొన్నాను.

'నిజమే!' చిరుకోపంగా అడిగితే, జడ విడిపించుకొంటూ నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి. కళ్లు గుండెల్లోకి చూశాయి నోరు తెరవకుండా మతాబంగా నవ్వింది రాణి.

* * *

రాణికప్పుడు పదహారేళ్లు. స్కూల్ ఫైనల్ పరీక్ష వ్రాసింది. అక్కదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

షరాంశం కూతురుకు పెళ్లి సంబంధం చూడమని.

వావల్ల ఏమవుతుంది? నా పెళ్లి చేసుకోలేని నేను రాణి పెళ్లిసంబంధం ఎలా చూడగలను?

నా అసమర్థతపట్ల నాకే అసహ్యం వేసింది. జవాబు వ్రాయకుండా వూరుకొన్నాను.

నెలరోజులకు మళ్లీ ఉత్తరం వచ్చింది. పిల్లను చూడటానికి ఎవరో వస్తున్నారు రమ్మని.

నేను పోయి ఏం చేయగలను? ఏమీ చేయలేను! పోకుండా ఉండటం ఎలా? వెళ్లాలి? అక్క రమ్మని వ్రాసిందికాబట్టి వెళ్లాను.

వాళ్లు వచ్చారు. రాణిని చూచుకొన్నారు. నచ్చిందని చెప్పారు. తాంబూలాలు పుచ్చుకొన్నారు.

కుర్రాడు ఇంజనీరు. ఒక్కడే కొడుకు చాలా ఆస్తిపరులు.

అక్క బావదగ్గరకు పోతూ తీసుకుపోయింది ఏమీ లేకపోయినా, మేము ఏమీ ఇవ్వలేకపోయినా, రాణికి కట్నం చాలా ఇవ్వాలని ఇవ్వగలబావ నిరయించుకొన్నాడు. విమాలోచిస్తే ఆస్తి అంతా రాణిదే!

ఆ సాయంకాలమే బయలుదేరాను. ఆఫీసులో ఫైళ్లు పెరిగిపోతాయనే చింతతో!

ఆరోజంతా రాణి కనిపించలేదు. రాణి ఎక్కడుంది అని అడగటానికి ఎందుకో బాధ కలిగింది.

గేటు దగ్గరకు వచ్చి వెనక్కు చూస్తే కిటికీలోంచి రాణి కనిపించింది.

కళ్లల్లో నీటిబిందువులు నిలిచి వున్నాయనిపించింది. ఆనందబాష్పాలో! విషాద బిందువులో!!

ఒక్క అడుగు వెనక్కు వేశాను. చూస్తుంటే ఆమె నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి. కళ్లు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా మతాబంగా నవ్వింది రాణి.

* * *

రెండువారాల్లో పెళ్లికార్డు వచ్చింది, అంతకు వారంముందే ప్రమోషన్ రావటం వల్ల పనిభారంవల్ల రాణి పెళ్లికి వెళ్లలేక పోయాను.

పెళ్లయింతర్వాత రాణికి స్వేచ్ఛ వచ్చిందో ఏమో ఉత్తరం వ్రాసింది.

అందులో సంగతి ఏమీలేదు. ఫలానా

తారీఖు ఫలానా రైలుకి పొద్దున్న బయలుదేరి అత్తవారింటికి వెడుతున్నాను భర్తతో అని మాత్రమే వుంది.

స్టేషన్ దగ్గరకు పోయాము. రైలు వచ్చింది. ఫస్ట్ క్లాసు కంపార్టుమెంటులో కనిపించింది రాణి. రైలెక్కాను.

భర్తను పరిచయం చేసింది.

చక్కగా వున్నాడు. ఆరోగ్యంగా వున్నాడు. అంతకంటే అన్ని అందాలా రాణి బాగుంది.

ఏమేమో మాట్లాడింది.

మాటల్లో పెళ్లికి రాలేదేమని అడిగింది.

'కార్యభారంవల్ల' అని చెప్పాను.

నమ్మనట్లు చూచింది.

గార్డు విజిల్ వూదాడు ఇంజన్ కూత వేసింది. కంపార్టుమెంటులోంచి దిగాను.

'క్షేమ నమ్మను'

'నిజంగా నమ్మవా?'

రైలు కదిలింది.

'ఉహూ!' తల అడ్డంగా వూపింది. కోపంగా చూశాను. నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కను రెప్పలు కదిలాయి. కళ్లు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా మౌనంగా నవ్వింది రాణి.

* * *

రెండేళ్లు తిరక్కుండే—రాణి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.—రాణికి ఆడపిల్ల.

ఎంతో సంతోషంతో వెళ్లాను.

పాపాయి ఎంతో ముద్దుగావుంది. ఎంత

## ఏముందినాకు?

సేపు చూచినా తనివి తీరటంలేదు.

అంత అందాలరాశిని నే నెప్పుడూ చూడలేదు.

'పాపాయిది అంతా తాత పోలికే' అంటుంటే ఎందుకో అమితంగా సిగ్గు కలిగింది. అందరూ అదే మాట అంటే నాకు ప్రాణం పోయినంత పనయింది. ఎంత ఆనందమో!

పసిగందుకు పాలిచ్చి, వచ్చి, అన్నం వడ్డిస్తున్న రాణిని చూస్తుంటే అక్కయ్య గుర్తుకు వచ్చింది.

'పాప మీ పోలికేనట!'

'అవును అందరూ అంటున్నారు'

ఆ రోజు ఎంత అన్నం తిన్నానో నేను చెప్పలేను. కొన్ని వందలఏళ్లనుంచి, అతిశయోక్తి కావచ్చుగాక, అన్నం ముఖం ఎరుగని మనిషిలాగా అన్నం తిన్నాను.

'మీ రెందుకు పెళ్లి చేసుకోరు!' అడిగింది రాణి తమలపాకు చుట్టి ఇస్తూ.

'నేనా?' నవ్వి వూరుకొన్నాను.

పాపకేవో కానుకలు కొనిఇచ్చి బయలుదేరుతున్న సాయంకాలం 'మనమరాలు ఎలా వుంది?' అని అడిగింది.

'బాగుంది'

'పెళ్లాడకూడదూ!'

కోపంగా చూస్తే నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కను రెప్పలు కదిలాయి. కళ్లు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా మౌనంగా నవ్వింది రాణి.

* * *

నాకు అరవై ఏళ్లు. పెళ్లికీ నాకూ చుక్కెదురు అయింది. రాణికి ఇద్దరు ఆడపిల్లలు ఇద్దరు మగపిల్లలు. పెద్దకూతురు యం. బి. బి. యస్. పూర్తి చేసింది. పెద్దకొడుకు ఇంజనీరు అయ్యాడు. చిన్నకొడుకు బి. ఏ. చదువుతున్నాడు. రాణి దగ్గర్నుంచి ఆ రోజు వచ్చిన ఉత్తరంలో అత్యవసరమైన పనివుంది, వెంటనే రమ్మని వ్రాసింది.

రిటైర్ అయి నెలకు రెండువందల ఏభై పెన్షన్ పుచ్చుకొంటూ స్వంత యింట్లోంచి ఎక్కడికీ పోకుండా జీవితంలో పరమాధ్యాయం ఒంటరిగా చదువుకొంటున్న నాకు స్థలం మార్పు అంటే భయం కలిగింది.

అయినా వెళ్లాను.

భర్త అలిగి, ఆఫీసుకు సెలవుపెట్టి ఇంట్లోనే వున్నాడు. ఆఫీసు ఫైళ్లు సంతకం చేసి పంపుతున్నాడుగాని భార్యతో మాటాడటంలేదు.

సంగతేమిటంటే రాణి చెప్పింది.

ఎం. ఏ. చదివిన అమ్మాయి ఎవర్నో ప్రేమించిందట. పెళ్లాడతానందట. అందుకామె అంగీకరించిందట. ఆయన ఒప్పుకోలేదట.

ఇంజనీరయిన కొడుక్కు పెళ్లిసంబంధాలు వస్తున్నాయట. బుద్ధిలో నా పోలికేనట! పెళ్లి వద్దంటున్నాడట వాడి ఇష్టానికి వ్యతిరేకంగా చెయ్యవద్దు అందట రాణి. ఏదో మంచిసంబంధం వుంటే అదే చేయాలని ఆయన పట్టుదలట.

రాణీ, భర్తకూ మధ్య పిల్లల విషయంలో తగాదా ద్విగుణీకృతమై పెరిగిపోయిందట.

రోజూ సాయంకాలం నడవటం నాకు అలవాటు అయింది అలాగే బయలుదేరాను. రాణి భర్త వెంట వచ్చాడు. తోవలో మాకు పిల్లలవిషాదే సంభాషణ.

రాణి చెప్పే విషయం నాకు అన్నివిధాలా నచ్చింది, ఆమె అభిప్రాయం గౌరవించటం శ్రేయస్కరమని చెప్పాను. రెండుగంటలకు తిరిగి వచ్చామింటికి.



# నిగనిగలాడే, అందమైన జుట్టు

## టాటావారి సువాసన గల కేస్టర్ హేర్ ఆయిల్

### జుట్టును, రోజంతా చెదరకుండా వుంచును

దువ్వుకొన్న తమ జుట్టును చెదరకుండా వుంచుకుంటారు కాబట్టి, వ్యక్తులు అందముగా, ఆకర్షణీయముగా కనబడతారు. మీరు కూడా టాటావారి సువాసన గల కేస్టర్ హేర్ ఆయిల్ వాడండి. దీనిలోని విశేష గుణముల వలన మీ జుట్టు ఆరోగ్యంగా వుండటమే గాక దానికి ప్రత్యేకత గల అందం వస్తుంది. మరియు రోజంతా నిగనిగలాడుతూ వుంటుంది.

క్రొత్త, ఆకర్షణీయమైన సీసా 3 సైజులలో లభిస్తోంది




టాటావారి కేస్టర్ హేర్ ఆయిల్—
**నిగనిగలాడే, చెదరని, ఆరోగ్యమైన జుట్టు కొరకు**

# ఏమవుందినాకు?

రాత్రి అన్నం పెడ్తున్న రాణిని చూస్తుంటే చిన్నతనంలో ప్రతిమారి నాకు అన్నం తినిపించే అమ్మ గుర్తుకువచ్చింది.

'మీరూ ఇక్కడే వుండిపోకూడదూ!' అంది పెరుగు వేస్తూ.

'నేనా?' అన్నాను నవ్వుతూ.

'అవును. మీకుమాత్రం ఎవరున్నారు. ఇక్కడే వుండండి మాకు తోడుగా వుంటారు' అంది.

'వద్దులే, నా యిల్లే నాకు సర్వస్వం. రేపు వెడతాను'

భోజనం పూర్తయింది.

ఆ రాత్రి నూత్న దంపతులువంటి భార్యాభర్తల గదిలోంచి వినిపించిన నవ్వులు నాకు జోల పాడినట్టున్నాయి. హాయిగా నిద్రపోయాను.

తెల్లవారింతర్వాత వెళుతుంటే గేటుదాకా వచ్చింది రాణి.

'వెళ్ళొస్తాను' చెప్పాను.

'జాగ్రత్తగా వెళ్ళిరండి' అంది.

'అంతే!'

'రెండుగంటల్లో అంత పట్టుదలమనిషి మనసు మార్చారుగానీ, ఇన్నేళ్ళలో మీమనసు మార్చుకోలేకపోయారు'

'అంతే!' అంటూ కోపంగా నవ్వుతూ చూస్తే, నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి. కళ్ళు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా సుతారంగా నవ్వింది రాణి.

* • *

రాణికి నలభై అయిదేళ్ళు. ఒకరోజు ఆమె దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

ఆయన చనిపోయాడు.

హడావుడిగా బయలుదేరివెళ్ళాను. వెళ్ళేసరికే సంస్కారం పూర్తయింది.

రాణి మూర్తీభవించిన దైన్యంలాగా వుంది. ఆమెను ఓదార్చాలనుకొన్న నేను కంట తడిపెట్టుకొంటుంటే జాలిగా తుడిచి 'విచారించకండి' అని ఓదార్చింది.

అక్కణ్ణుంచి రెండు వారాలు అయినా రా బుద్ధి పుట్టలేదు నాకు.

ఎక్కడెక్కడో ఉద్యోగాలు చేసుకొంటున్న పిల్లలు అన్ని విషయాలు తెల్సుకొని వెళ్ళిపోయారు. వాళ్ళ అన్ని సంభాషణల మాటల్లో ఒక్క మాట కూడా ఆమె మాట్లాడలేదు. నేను లేకపోతే ఆమెకు అన్యాయం జరిగివుండేదని నేను అనుకొంటే, ఆమె అలా అనుకోలేదు.

పిల్లలు వెళ్ళిపోయాక అంకంత ఇంటిలో ఆమె ఒక్కతే పనివాళ్ళతో ఎలా వేగుతుందో నాకు అర్థం కాలేదు.

నేను వెళ్ళిపోతానన్నప్పుడు ఆమె వద్దనలేదు. బయలుదేరుతూ నేనే అన్నాను.

'ఇక్కడెందుకుండాలి నువ్వు! నా దగ్గరే వుందువుగాని వెళదాం రాకూడదూ?'

'నేనా?'

'ఆఁ! నువ్వే! రారాదూ!' కోపంగా అడిగితే నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి. కళ్ళు గుండెల్లోకి చూశాయి. నోరు తెరవకుండా సుతారంగా నవ్వింది రాణి.

* * *

అయిదేళ్ళు గడిచాయి. నాకు డెబ్భై ఏళ్ళు. రాణి ఏభై. నాకు వంట్లో శక్తి సన్నగిల్లిపోతు వుంది. ఏమిటో ముసలితనం అంత శాపం లేదనిపిస్తుంది. ఎవరూ—నా అనేవాళ్ళు ఎవరూ లేని ఈ జీవితం నరకం కంటే అన్యాయంగా వుంది.

అనిశ్చిత జీవితానికి పర్యవసానం నేను దోషరహితంగా, నిర్మల జీవితం జీవించాననే తృప్తికాని పొందింది ఏమీలేదు. నేను ఇలా కావటం ఎవరికోసం? నా కోసం కాదు! మరెవరికోసం? నాకు తెలియదు!

రాణి ఉత్తరం వ్రాయించింది.

ఆమెకు ఆరోగ్యం బాగాలేదట, వెంటనే రమ్మని వుంది.

గుండెలు గుబ గుబలాడాయి. ఇంత ముసలితనంలోనూ, నాకు ఎంతో శక్తి వచ్చింది. బయలుదేరాను.

నేను వెళ్ళేసరికి ఆమె మంచంమీద వుంది. లేవలేదు. ఇల్లంతా హడావుడిగా వుంది. పిల్లలూ, పిల్లలపిల్లలూ అంతా వచ్చారు.

ఆ రోజంతా ఆమె ఏమీ మాట్లాడలేదు. మాట పడిపోయిందన్నారు కాని 'వచ్చారా? రారేమో—అను—కొన్నా.' అంది. ఆ తర్వాత ఏదో చెప్పబోయింది. చెప్పలేకపోయింది. నీరసంగా తల కొట్టుకొంది. తల

పట్టుకొని మంచంమీద కూర్చున్నాను.
కళ్ళు మూసుకొంది.

గంటసేపు విలవిలలాడి కళ్ళు తెరిచింది. నా వైపు చూచింది. ఆమె కళ్ళలోని చైతన్యాన్ని నా కళ్ళు పీల్చుకొన్నాయేమో ఆమె కళ్ళు నిర్జీవాలయ్యాయి.

ఇల్లంతా ఘొల్లుమంది.

తెల్లవారేసరికి బంధువులంతా వచ్చారు. ఇక వచ్చేవారు ఎవరూ లేరనుకొన్న తర్వాత శవసంస్కారానికి ఏర్పాట్లు మొదలయ్యాయి.

శవవాహకులకోసం చూస్తున్నారు. నేను మోస్తానంటే 'నువ్వు ఎందుకు ముసలి వాడివి,' 'నీ కెందుకు అనలే వార్ధక్యం' అన్నారు ఎందరో. నేను వినిపించుకోలేదు. నేను కూడా ఒకణ్ణి రాణిని స్మశానానికి మోసుకుపోతున్నాం.

నేను ఎత్తుకొన్న పిల్ల, నా కళ్ళముందు పెరిగిన అమ్మాయి, నా అంత అయిన రాణి, నాకు నీతి చెప్పగల స్త్రీ నాకంటే ఎదిగి పోయిన రాణి, స్మశానానికి వెళుతూవుంది. నేను పుట్టినప్పుడు ఎక్కడున్నానో ఇంత వయస్సులో అక్కడే వున్నాను.

ఎక్కడనుంచో ఇక్కడ పడిన రాయిని నేను. నా కళ్ళముందే పడిన గింజ ఆమె, ఆమె మొలకెత్తింది నా ప్రక్కనే పెరిగి పెద్దదయింది. విశాలవృక్షం అయింది నాకు కూడ నీడనిచ్చింది. పూలు పూసింది పళ్ళు కాచింది. గింజలనిచ్చింది. గింజలు మళ్ళీ మొక్కలూ వృక్షాలు అవుతున్నాయి. అయితే ఈ రాయి ఇలాగే వుండిపోయింది, ఎండకు వేడి ఎక్కుతూ వానకు చల్లబడుతూ చలనం లేకుండా ఎదుగుబొదుగూ లేకుండా.

రాణిని ఎండు కట్టెవంటి రాణిని, కట్టెలమీద పడుకోబెట్టారు. పెద్దకొడుకు కొరివి పెట్టాడు. కట్టెలు అంటుకొన్నాయి

ఇక నాకేముంది? నా జీవితానికి అర్థం ఏముంది? నాకేం మిగిలింది? ఏమిటిది? అని విచారం కలిగింది కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి. నాకేం మిగిలింది అనుకొంటూ కోపంగా ఆమె ముఖంలోకి చూస్తే ఆమె నవ్వింది.

బుగ్గలు నొక్కులు పడ్డాయి. కనురెప్పలు కదిలాయి కళ్ళు గుండెల్లోకి చూశాయి పెదవి తెరవకుండా మితారంగా నవ్వింది రాణి. ●

# కన్నయ్య అభివృద్ధిలోని పరమరహస్యం-3

కన్నయ్యా! నీవు నాతో మద్రాసు రావడంతో సంతోషము...
ఓ.కె.పశువులపిండి తయారు చేసేదెలాగో నీవు ఎదురుగానే చూడవచ్చు.



ఇదే... "ది ఈస్ట్ ఏషియాటిక్ కంపెనీ" ఇండియాలోని ప్రధానకార్యాలయం. ఈకంపెనీయే ఓ.కె. పిండిని తయారుచేసేది. ఈలాగే ఈ ప్రపంచమంతటా 36 దేశములలో 113 కార్యాలయములున్నవి.
రండి! కర్మాగారమునకు పోదాం....



ఓహో!... ఈ కంపెనీకి ఇంత పెద్ద కార్మాగారము కలదా? నాకుతెలియదే....! ఇండియాలోనే ఇదే పెద్దదా?



ఇంకా ఎన్నో కార్మాగారము లున్నవి. అయితే మొట్టమొదట్లో ఓ.కె. సంస్థాపకులే ఓ.కె. పశువుల పిండిని తయారుచేశారు. అదీగాక, నవీన శాస్త్రీయపరిశోధనాలయమొకటి మాదగ్గర మాత్రమే కలదు.



రండి...ఈలాంటి పరిశోధనాలయము మరెచ్చటనూ లేదు. మీ పశువులకు శ్రేష్ఠమైన పిండిని ఇచ్చుటనే తయారు చేస్తున్నాము. ఈ శాస్త్రజ్ఞులు అమెరికాలో తర్ఫీదు పొందినటువంటి వారు.



ఇదే మా పరిశోధనా కేంద్రం. ఇందలి పరికరములన్నీ మిక్కిలి ఖరీదైనవి. ఈ పరికరములతోనే ఓ.కె. పశువుల పిండి చాలామంచిదని రుజువు చేయగలుగుతున్నాము.



ఇవన్నియూ ఇతరదేశపు పశువులు. వీనితోనే పరీక్షలు చేసి ఓ.కె. పిండిని ఇంకా మేలుగా తయారుచేయ కలుగుతున్నాము.




మీకు చాలా నమస్కారములు. ఓ.కె. పిండి ఎందుచేత ఇంత శ్రేష్ఠమైనదని నాకు ఇప్పుడే తెలుస్తున్నది...
సరే ... రండి ... కార్యాలయమునకు పోదాం! నమస్కారములు.






విటమినులుగల ఓ.కె. పశువుల పిండితో మీపశు సంపదనూ అభివృద్ధిని సాధించండి!

**ది ఈస్ట్ ఏషియాటిక్ కంపెనీ (ఇండియా) ప్రైవేటు లిమిటెడ్, మదరాసు-1**

# బెహరిన్

ఇది ఆరులంకల చిన్న దేశం. మొత్తం వైశాల్యం 250 చదరపు మైళ్ళు; జనాభా 185000 ఇందులో 83 శాతం అరబ్బులు, 3 శాతం భారతీయులు.

ఈ రాజ్యం ముఖ్య పట్నం పేరు మనామా: ఇది దేశానికి ఉత్తరం వైపుగా ఉంటుంది

బెహరిన్ చాలాభాగం ఎడారి ప్రాంతం కల దేశం. అక్కడక్కడ మంచినీటిబావులు నీటి ఊటలు ఉంటాయి. నీటి సాయంతో సాగుబడి చేస్తారు. ముఖ్యంగా అత్తి, బాదం చెట్లు ఇక్కడ బాగా వేస్తారు.

ఇక్కడ చలికాలంలో 64 డిగ్రీల దాకా ఉంటుంది. జూన్‌నుంచి సెప్టెంబర్ దాకా ఎండాకాలం. బాగా ఉక్కగా ఉంటుంది! ఇక వర్షం ఏడాదికి మూడు అంగుళాలకి తక్కువ ఉంటుంది.

ఈ దేశంలో అరబ్బువనితలు యూరోపియన్ వనితలవలెనే 'స్కర్ట్' వగైరాలు వేసుకుంటారు కాని బయటికి వెళ్ళినప్పుడు మాత్రం నల్లటి బురఖా వేసుకుంటారు. చాలామంది మగవారు కాళ్ళదాకా వచ్చే పొడుగు చొక్కాలు వేసుకుంటారు. తలమీద చిన్నటోపీ, దానిమీద తెల్లగుడ్డ, జడమాదిరిగా అల్లిన నల్లటితాడు అరబ్బు వేషం. ఆధునికులు కొందరు మామూలు లాగూలు, చొక్కాలు ధరిస్తూ ఉంటారు.

బహరిన్ వనితలు భారతీయ వనితలవలెనే ఇప్పుడిప్పుడు మాత్రమే సాంఘికజీవనంలో అన్నిరంగాలలోనూ ప్రవేశిస్తున్నారు. టీచర్లుగా, నర్సులుగా కొందరు చేరుతున్నారు.

ప్రభుత్వం నడిపే పాఠశాలలు చాలా ఉన్నాయి. విద్యాభ్యాసం ఉచితం. అన్ని శాస్త్రాలూ అరబ్బు భాషలోనే నేర్పుతారు. పెద్దక్లాసులలో ఇంగ్లీషు నేర్పుతారు. ఒక 'ఇండియన్ స్కూల్' కూడా వుంది. పాఠశాలలు, ప్రభుత్వ కార్యాలయాలు అన్నీ మధ్యాహ్నం ఒంటిగంట లోపుగానే మూసివేస్తారు. కొన్ని ప్రయివేట్ కంపెనీలు మాత్రం సాయంత్రందాకా పనిచేస్తాయి. ఇక్కడ ప్రతి శుక్రవారం సెలవురోజు

బెహరిన్‌లో నేరాలు తక్కువ. ఇక్కడ ఎలక్ట్రిసిటీ ఒక యూనిట్ పది పైసలు. దిగుమతులు చాలా అధికం, దిగుమతి సుంకం తక్కువ; అందుచేత ఆధునిక వస్తుసామగ్రి చాలా దొరుకుతుంది. ఆహారవస్తువులు కూడా చాలా చోట్లనుంచి దిగుమతి అవుతాయి.

అరబ్బులు ధాన్యాలలో గోధుమ అధికంగా తింటారు. ఇక్కడ ఒక రొట్టె వెల 10 ఫిల్స్—అంటే సుమారు ఏడు పైసలు. పాలు ఒక లీటరు సుమారు 160 ఫిల్స్ లేదా రు 1-12.

నీరు బాగా దొరకవు కాబట్టి తాగేనీరు గాలను 25 ఫిల్స్ చొప్పున అమ్ముతారు. ఇవి పీపాలతో ఇంటివద్దకి తెచ్చి ఇస్తారు.

మహమ్మదీయ మతాదేశానుసారం ఇక్కడ మద్యపానాన్ని నిషేధించారు. విదేశీయులకి పర్మిట్లు ఇస్తారు.

బెహరిన్ చాలాకాలంనుంచి ముత్యపుచిప్పల సేకరణకి ప్రసిద్ధిచెందినది. వాటిని ఏరేకాలం జూన్‌నుంచి అక్టోబర్‌దాకా. 1930 లో 21.25 లక్షల రూపాయల ముత్యాలు ఏరారుకాని క్రమంగా విలువ పడిపోతున్నది. దానికి కారణం ఈ ప్రాంతంలో పెట్రోలు పరిశ్రమ అభివృద్ధి కావడమే.

బెహరిన్‌లో ప్రతిసందులోనూ ఒక మసీదు ఉంటుంది. వాటిలో లవుడ్‌స్పీకర్లు నిర్ణీత కాలాలలో ప్రార్థనలని ప్రసారం చేస్తూ ఉంటాయి. మూడు చర్చిలు ఉన్నాయి ఎవరో ఒకరు 'కృష్ణాలయం' ఒకటి నిర్మించారు - ఒక గదిలో శ్రీకృష్ణ విగ్రహం ఒకటి పెట్టారు, అంతే.

వివాహాల సాధారణంగా వరుడి తల్లి, చెల్లెలు వచ్చి కుదురుస్తారు. వరుడే వధువుకి కట్నం ఇవ్వాలి అన్ని వివరాలూ న్యాయస్థానంలో ప్రకటించి న్యాయాధికారి అనుమతితో వివాహం జరుపుతారు. విడాకులు పుచ్చుకున్నట్లయితే కట్నం తిరిగి ఇచ్చివెయ్యాలి

బహరెయిన్‌లో సినిమా హాల్లు చాలా ఉన్నాయి. హిందీ, అరబ్, ఇంగ్లీష్ సినిమాలు ఎక్కువగా ఆడతాయి.

పెట్రోలు చవుకకాబట్టి కార్ల సంఖ్య అధికం ప్రభుత్వం సాంఘిక శ్రేయస్సుకి సంబంధించిన కార్యక్రమాలని ఎన్నిటినో ఏర్పరుస్తున్నది.

ఇక్కడ చాకరివాళ్ళలో చాలామంది ఉత్తర భారతీయులు. అయితే అధికంగా భారతీయులు వ్యాపారం చేస్తూ ఉంటారు— ఇండియన్ షాపులలో ధరలు కొంచెం అధికంగా ఉంటాయి! పనిమనుషుల జీతాలు ఎక్కువ, అందుచేత ఎవరిపనులు వారే చేసుకోవడం అలవాటు.

బెహరిన్‌లో చాలాకాలం ముందు ఆఫ్రికనీలు వచ్చి స్థిరపడిపోయారు. వారికి తక్కినవారితో సమానహక్కులు ఉన్నాయి.

ఇక్కడ రవాణా సౌకర్యాలు - మనుష్యులకి టాక్సీలు, బస్సులు; వస్తువులకి లారీలు, గాడిదబళ్ళు, గాడిదలు.

—మృగశిర



# జీవనరాగం

ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరిలోకీ చప్పగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిదే యజమానాయిషీ. పెద్దక్కయ్యకి జబ్బుగావుందని టెలిగ్రాం వస్తుంది. పెద్దక్కయ్యంటే నిరంజనానికి ప్రాణం. వెంటనే బయలుదేరి వెళ్లాడు. వసంత నిరంజనం కూతురు. ఆమెకి చాల గొప్ప సంబంధం చేయాలని సీతమ్మగారి వాంఛ. వసంతని చూడ్డానికి పెళ్లివారు వస్తున్న సమయంలోనే ఈ ఆవాంతరం రావడంవల్ల సీతమ్మగారికి ఒళ్లుమండుతుంది. అన్నీ సక్రమంగానే జరిగి, వసంత పెళ్లి అయిపోతుంది. నిరంజనం పెద్దకొడుకు మధు.

## 4

బీరువా తెరచి పంచ, టవల్ భుజంమీద వేసుకుని బీరువా మళ్లీ తాళంవేసి వెనక్కి తిరిగింది మీనాక్షి. గుమ్మంలో నిరంజనం. ఎన్నడూలేనంత సిగ్గు ముంచుకు వచ్చింది మీనాక్షికి. అడుగు ముందుకు వేయలేనిదానిలా అలాగే బీరువా వానుకుని నిలబడిపోయింది. హృదయంలో పరవళ్లు తొక్కుతున్న భావాలకి అనుగుణంగా అపూర్వమైన కాంతితో వెలిగిపోతున్న మొహాన్ని, మనోహరంగా విచ్చుకోబోతున్న పెదవుల కదలికను కనబడనీయకూడదన్నట్లు తలవంచుకుని అరచెయ్యి నోటికి అడ్డం పెట్టుకుంది.

తలుపులు జారవేసి కాఫీగ్లాసు టేబిలు మీదపెట్టి దగ్గరగా వచ్చాడు నిరంజనం. మృదువుగా ఆమె మొహం పైకెత్తి 'నువ్వు రాయలేదేం?' అన్నాడు, అంతకన్నా మృదువుగా అభిమానంగా.

'ఛ. సిగ్గెయ్యదూ. ఎలా వ్రాస్తాను.' అన్నట్లుగా వాలిపోతున్న కళ్లని కొద్దిగా ఎత్తి తలవూగించింది.

'నాకింకా ఒక ఏడు చదువుంది. ఆ తరువాత ఇంకో ఏడాదేనా అయితేకాని సంపాదనపరుడ్ని కాలేను. ముప్ఫైలోగానే నన్ను తండ్రిని చేసేస్తున్నావు.'

రాబోతున్న నవ్వుని పెదవుల మధ్యే బిగపట్టి భర్త గుండెల్లో తలదాచేసుకుంది మీనాక్షి.

'వంట్లో అంత బాగుండటంలేదు. వాళ్లమ్మగారు ఓసారి తీసుకువెళ్తా నంటున్నారు—' అంటూ అన్నయ్య వ్రాశాడు. 'నేనెంత జాగ్రత్తగా చూసుకుంటున్నా ఇది అత్తవారిల్లే కదా. పోనీ కొన్నాళ్లు తల్లి దగ్గరవుండి వస్తుంది.' అంటూ అమ్మ వ్రాయించింది. నాకెంత భయం వేసిందో తెలుసా. నువ్వెళ్తే మళ్లీ నే వచ్చేసరికి రావేమోనని—పరవాలేదు ఇక్కడే వుంటానని నువ్వే అన్నావుటగా,' మీనాక్షి మొహం ఎత్తి కృతజ్ఞత వ్యక్తంచేస్తున్నట్లు అభిమానంగా చూడబోయాడు. ఏదో చెప్పబోయిన మీనాక్షి చిన్నగా నవ్వి కళ్లు వాల్చేసుకుంది.

'ఏమిటిది, మాటలు మరచిపోయావా. అదివరకే నయం కొత్తయినా లేకుండా పిట్టలా వాగేదానివి—ఓ తెలిసిందిలే—ఇది కూడ...'

ఫక్కుమని నవ్వేసింది మీనాక్షి.

'చెప్పు. నేను వున్నన్నాళ్లు నువ్విక్కడే వుండాలి. ఉంటావా – తలవూపటంకాదు నోటితో స్పష్టంగా చెప్పాలి.'

'ఏంమాట తప్పనని ధైర్యమా' చిలిపిగా అడిగింది.

'అరే నువ్వు మాట్లాడటం మరిచిపోలేదు! చెప్పు. ఒకవేళ మీ అమ్మగారు వచ్చి తీసుకువెళ్తానంటే?'

'రానని చెప్తాను,'

'గుడ్. మా మీనాక్షి చాలా మంచిపిల్ల. అయినా ఇంకా పిల్లేమిటి...' ఇద్దరూ విందుగా నవ్వుకున్నారు.

శలవలు రెండునెలలు రెండు క్షణాల్లాగే గడిచిపోయాయి.

కనీసం వారానికి రెండు వుత్తరాలైనా మీనాక్షి దగ్గర మాట తీసుకుని రైలెక్కాడు నిరంజనం—పెద్దతల్లి మాధవమ్మగారితో పుట్టింటికి వెళ్లిపోయింది మీనాక్షి.

కాలేజీకి ఆలశ్యం అయిపోయిందని హడావిడిగా తయారయి రూమ్‌తాళం వేయబోతున్న నిరంజనం పోస్టు అన్న కేకతో వెనక్కి తిరిగాడు. ఓ కార్డు అతని చేతిలో పెట్టి వెళ్లిపోయాడు పోస్టుజవాను.

కార్డు కేసి క్షణం చూచిన అతని కళ్లు సంతోషంతో తృప్తిగా మెరవసాగాయి. గబగబ ఒక్క నిముషంలో నాలుగుసార్లు ఆ నాలుగు పంక్తులూ చదివేశాడు. తను నాలుగు రోజులనుండి ఎదురు చూస్తున్న శుభవార్త అది–ఇవాళ ఆలశ్యం ఎలాగూ అయింది. క్లాసులు అటెండవడానికి మూడ్ కూడలేదు–కాని ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వెళ్లి స్నేహితులకి ఆ శుభవార్త అందించాలని ఆత్రంగా వుంది. అందుకే గబుక్కున వీధిలోకి వెళ్లబోయాడు—మళ్లీ అంతలోనే ఓ విధమైన సిగ్గు, బిడియం అతన్ని ఆవరించాయి—'తన క్లాసు మేట్సు చాలమందికి అసలు పెళ్లే కాలేదు. తను అప్పుడే తండ్రి అయిపోయానని ఎలా చెప్తాడు. వాళ్లంతా హాస్యం పట్టించరా? ఏడిశారు. ఇవాళ కాకపోతే మరో రెండేళ్లకయినా వాళ్లు మాత్రం పిల్లల్ని ఎత్తుకోరూ? ఇదేమంత కానిపని అని తను సిగ్గుపడాలి—రావుకి లాస్టియరులో కూతురు పుట్టింది—భార్యని తెచ్చుకుని హాయిగా సంసారం చేస్తూనే చదువు సాగిస్తున్నాడీఏడు. అయినా ఇప్పుడు క్లాసులు జరుగుతూండగా మధ్యలో వాళ్లని పిలిచిచెప్పటం ఎందుకు — కాలేజి వదిలేవేళ్టికి చెప్తే సరి—ముందుగా ఇంటి వాళ్ల చెవిని ఈ మంచిమాట వెయ్యటం తన కర్తవ్యం — ఆ బామ్మగారు అస్తమానూ అడుగుతూంటుంది—' కాలేజికి వెళ్లని దానికి పుస్తకాలుకూడ ఎందుకన్నట్లు తలుపుతీసి అవి టేబిలుమీద గిరాటేసి తలుపులు దగ్గరగా లాగి వరండాదాటి వాళ్లింటివేపు వెళ్లాడు.

బామ్మగారు వత్తులు చేసుకుంటూ మధ్య హాల్లోనే కూర్చుంది. నిరంజనాన్ని చూసి—చాపుకున్న కాలు ముడుచుకుంటూ ముక్కుమీదికి జారిపోతున్న కళ్లజోడు పైకి

తీసుకుని, 'ఏం బాబూ ఇవాళ కాలేజీకి శలవా ?' అంది.

'శలవులేదు నేనే వెళ్ళలేదు — వెళ్దాం అనుకునే లోపలే ఇదుగో ఈ వుత్తరం వచ్చింది. మా అవిడకి కొడుకు పుట్టాడు' అన్నాడు తను వచ్చిన పనికి పంజాయిషీ ఇస్తున్నట్లు.

'అయ్యో నీ ఇల్లు బంగారంగానూ, ఇంత నెమ్మదిగా చెప్తావేం — ఇదుగో కనకం విన్నావా ?' అంటూ లోపలికి కేకవేసింది బామ్మగారు.

'ఎప్పుడట — నక్షత్రం మంచిదేనా, శాంతి లేదుకదా —' ఆగకుండా ఆవిడ అడుగుతున్న వాటికి,

'మొన్న పొద్దున్నట — మా పెదమామగారు వ్రాశారు. మరింక వివరాలేం లేవు ఇందులో,' అన్నాడు నిరంజనం.

సాయంకాలం వెళ్ళి స్నేహితులందరికీ ఆ వార్త అందించి, దాంతోపాటుగా కాఫీ కూడ ఇప్పించాడు.

'మంచి పేరు సెలక్టు చెయ్యాలోయ్' అన్నాడు స్నేహితుడు.

'అదెప్పుడో డిసైడయి పోయింది. మా నాన్నగారి పేరే.' అన్నాడు నిరంజనం.

'ఏమిటది ?'

'మధుసూధనరావు'...

'ఎల్లుండేకదూ వసూవాళ్ళింట్లో పెళ్ళి — మరిచిపోకుండా గ్రీటింగ్సు పంపించాలి' అంటూ మధు వచ్చేసరికి అతని ఆలోచనలు చెదిరిపోయాయి. ఒక్కసారి ఉలిక్కిపడిన వాడిలా అయి అంతలోనే సర్దుకున్నాడు.

'ఎవరైనా వెళ్తే బాగుండేదేమో. దగ్గరయినా కాదు. నెల్లూరులో పెళ్ళి — నాకిక్కడ ముఖ్యమయిన కేసులున్నాయి—'

'మూర్తయినా వుంటే, నేను ఎలాగో రెండురోజులు శలవు తీసుకుని వెళ్ళేవాడిని. అతను మళ్ళీ లీవు ఎక్స్టెండు చేశాడు...' మధు చెప్తూంటే,

'సరేలే, ఏం చేస్తాం — రావటానికే ప్రయత్నం చేస్తానని, అంతగా రాలేకపోయినా ఏమీ అనుకోవద్దని మొన్ననే రాశాలే — గ్రీటింగ్సు కూడ పంపించు.', అని లేచాడు నిరంజనం.

* * *

కొత్తలో సుధకి ఏమీ చెప్పకుండా అపురూపంగానే చూసుకుంది సీతమ్మగారు. కాని ఆ తరువాత, 'ప్రత్యేకంగా నోరుతెరిచి చెప్పాలా ఏమిటి. పెద్దవారు మీకు శ్రమ ఎందుకు, నేను చేస్తాను, అని ఒక్కనాడైనా చేతిలోపని అందుకోదు కదా — మడిగట్టుకుని వంట చెయ్యక్కర్లేదు. పదిమందికీ వడ్డించక్కర్లేదు — కాస్త కాఫీ పెట్టటం, మొగవాళ్ళు భోజనానికి వచ్చేసరికి నట్టిల్లు తుడిచి పీటలువాల్చి కంచాలు పెట్టటంలాంటి వైనా చెయ్యకపోతే ముసిల్దాన్ని ఎంతకని చస్తాను' అని తనలో తనే విసుక్కుంటూండేది ఆవిడ. అలా తనలోతనే అనుకున్నా లాభంలేదనీ తనంతట తను నోరుతెరిచి చెప్పకపోతే సుధ ఏమీ చేస్తాననదనీ నిర్ధారణ చేసుకున్నాక ఆవిడే చిన్న చిన్న పనులు అప్పగించటం మొదలుపెట్టింది.

తనకి చేతకాదనో, లేకపోతే పుస్తకం పూర్తిచేసి లైబ్రరీలో ఇచ్చేయాలనో అదీ కాకపోతే తలనొప్పిగా వుందనో వంకపెట్టి తప్పించుకునేది సుధ. అలా తప్పించుకోటానికి వీలుకాని సమయాలలో సుధ పనిచెయ్యటానికి కూర్చున్న దగ్గిర్నుంచీ, 'ఆకాస్త పనీ నేనే చేసుకోక నేరకపోయి చెప్పాను ఈపిల్లకి!' అని చాటుగా పళ్ళు నూరుకుని మెటికలు విరుచుకోవలసి వచ్చేది సీతమ్మగారికి మళ్ళీ అంతలోనే, 'చెప్పకపోతే, ఎప్పటికీ అలా కూర్చోటమే అలవాటయి పోతుంది. నేనుండగానే నెమ్మదిగా నాలుగుపనులూ నేర్పకపోతే ఆనక ఆ ఇద్దరు మొగవాళ్ళకీ కంచంలో



ఇంత అన్నం అయినా పెట్టాలా?' అని తనకి తనే సర్ది చెప్పుకునేది.

ఇంకా బోలెడు వెలుగుంది. వంట కిప్పట్నించీ తొందరేమిటి?' అనుకుని రెండు అరటి పువ్వులు ఓ చేటామూటు పెట్టుక్కూర్చుంది సీతమ్మగారు. తెల్లటి మల్లె పువ్వుల్లాంటి ఇస్త్రీ చీర కట్టుకుని చక్కగా ముస్తాబయి వచ్చిన సుధ, ఆవిడ ఆ పువ్వులు వలవొల్చే చోద్యం చూస్తున్నట్టు గుమ్మంలోనే నిలబడిపోయింది.

'అప్పుడేనా?' అంది సీతమ్మగారు.

'కాలేజీలో పార్టీ వుందని వెళ్లాను.' అంది సుధ అలా నిలబడే. సాయంకాలం సుధ ఇంటికి వచ్చిన తరువాత కాఫీ ఇచ్చి ఏవో కబుర్లు చెప్తూ సుధ కూడా గదిలోనే కూర్చుంటుంది. ఏమీ తోచకపోతే ఇద్దరూ కలిసి సినిమాకి వెళ్తారు —

'ధరలు పెరిగిపోతున్నాయి తిండికి కూడ ఇబ్బందిగానే వుంది అని జనం ఓ పక్క మొత్తుకుంటూనే వున్నారు. మరో పక్క సినిమాలకి డబ్బు తగలేస్తూనే వున్నారు. ఇలాంటి సరదాలు వుండటంగానే ఈ వూరికి ఏమున్నా లేకపోయినా ఏడు సినిమాహాల్లు వెలిశాయి' అని వాళ్ళు వెళ్ళిన తరువాత సీతమ్మగారు సణుగుకుంటూంటుంది' ఆవాళ సుధకి వేరే ఏ ప్రోగ్రాం లేక ఖాళీగానే వుందని తెలుసుకుని,

'అయితే ఇది కాస్త వలిచిపెట్టు.' అంటూ ఓ పువ్వు పక్కకి జరిపింది ఆవిడ.

అసలే విడ్డూరంగా చూస్తున్న సుధ నుదురు చిట్లించి 'అది కూరగా వండుతారా?' అంది ఆశ్చర్యం ఎప్పుడో ఓ మహారాజు గరికపచ్చడి ఆప్యాయంగా తిన్నాడని కథ చదువుకున్నప్పుడు కూడ ఆ పిల్ల అంత ఆశ్చర్యపోయి వుండదు.

'నువ్వు అరిటిపువ్వు కూరెప్పుడూ తినలేదూ. మీ యింట్లో వండుకోరూ' అంది సీతమ్మగారు అంతకన్నా ఆశ్చర్యంగా బుగ్గలు నొక్కుకుంటూ.

'ఏమో, నాకెప్పుడూ తిన్న జ్ఞాపకం లేదు - అసలు పువ్వులు వలుచుకోటం తరుక్కోడం నేనెప్పుడూ చూడలేదు మా వంటావిడేం చేసేదోమరి' అంది సుధ ఇంకా అలాగే నిలబడి

'ఈ పువ్వు ఎన్నిరకాలుగానో వండుకో వచ్చు రేపొద్దున్న పెసరపప్పులో వేసి వండుతా తిని చూడు ఎంత రుచిగా వుంటుందో — పొద్దున్న లేచిందగ్గర్నించీ ఒకటే హడావిడి అయిపోతుందని ఇప్పుడే పెట్టుక్కూర్చున్నాను. నడుం పడిపోతోంది. కాస్త వలిచిపెట్టు.' అంటూ మెల్లిగా ఆజ్ఞాపించి గుమ్మం వార కొంగు పరుచుకుని నడుం వాల్చింది ఆవిడ.

ఇంక తప్పదన్నట్లు వెళ్లి కూర్చుంది సుధ- కాస్సేపటి తరువాత అప్రయత్నంగానే అరచేతుల వంక చూసుకుంది ఏడుపొచ్చినంత పనయింది. 'ఇదేమిటీ— పట్టుకుంది వదుల్తుందా అసలు?' కోపము దుఃఖము కూడ పొంగుకు వస్తున్నాయి ఆ గొంతులో తను ఎప్పుడూ చూసుకుని మురిసిపోయే తెల్లటి అరచేతులకి పట్టిన దుర్గతిని, అందంగా కత్తిరించి క్యూటెక్సు వేసిన గోళ్లకి దిష్టిబొమ్మ అతికించినట్లు ఇటూ అటూ నల్లబడిపోయిన వేళ్లని చూసుకుంటూంటే చేటపళ్లంగా ఎత్తి ముసలమ్మగారి నెత్తిన రుద్దేయాలన్నంత కోపం వచ్చింది

అప్పుడే కళ్ళు మూసిన సీతమ్మగారు సుధ మాటలకి కొద్దిగా కళ్ళు తెరచింది. ఆ అరమోడ్పు కన్నులతోనే జరిగింది గ్రహించుకుని, 'కాస్త పులిమజ్జిగతో కడుక్కుంటే పోతుంది అదేం కూర్చుంటుందనుకున్నావా?' మందలింపు ధోరణిలో అని మళ్ళీ పూర్తిగా కళ్ళు మూసేసుకుంది. ఆవిడ అలా భరోసా యిచ్చినా సుధ మరింక ఒక్క క్షణం అయినా అక్కడ కూర్చోలేకపోయింది లేచి పెరట్లోకి వెళ్లి పసపసా సబ్బు అరిగిపోయేలా రుద్దింది ఆ కస ఎడలేదు. అలాగే గొణుక్కుంటూ గదిలోకి వెళ్ళిపోయి టవల్‌తో తుడుచుకుంటూంటే, వెనక నుండి వచ్చిన మధు,

'ఎవరికీ ఆ అర్చన?' అన్నాడు కుర్చీలో కూర్చుని షూ లేసులు విప్పుకుంటూ.

'మీ కలాగే వుంటుంది — ఈ చేతులు చూడండి. చాకుతో చర్మం వలిచేస్తే ఏమయినా బాగుపడుతుందేమో — ఛ. వెధవ పన్లు. మనిషి ఒక్క నిముషం తీరుబడిగా నించుంటే ఆవిడ చూడలేదు.'

'ఎవరి సంగతి? ఏం జరిగింది? వివరంగాచెప్పు మరి' అన్నాడు. ఎవర్నిగురించో అర్థం అవుతూనే వున్నా.

'ఎవరి సంగతో ఎందుకవుతుంది. మీ అమ్మమ్మగారి సంగతే'

'ఏం చేసిందేమిటి?'

'ఆవిడ చెయ్యటంకాదు. నా చేత చేయించారు - ఛీ ఛీ. ఆవిడ పెట్టిన గడ్డి కూడ మీరు మహాభాగ్యంలా తింటున్నారు ఇన్నాళ్లూ - వెధవ అరిటిపువ్వుకూర నేను తినకపోయినా పని తప్పలేదు'.

'అదా సంగతి. అయితే మీ ఇంట్లో ఎప్పుడూ తినలేదూ - అరిటిపువ్వు అంటూ అంత తేలిగ్గా తీసిపారేయకు. దాంట్లో ఎన్ని విటమిన్సున్నాయో అది ఎంతబలమో తెలుసా' కుర్చీలోంచి లేచి షూ ఓమూలకి తోసేసి బట్టలు మార్చుకోటానికి ఉపక్రమించాడు.

'బలమో, పాడో. కంచంలో వడ్డించిన వాటిల్లో ఇష్టమైనవి తిని లేనివి వదిలేసి చెయ్యి కడుక్కుని రావడమే కాని మా వంటావిడ ఏంచేసేదో నేనెప్పుడూ చూడలేదు ఇక్కడికి వచ్చాకే ఇలాంటి పన్లన్నీ చేస్తున్నాను' అంది సుధ ఇంకా రోషంగా.

'ప్చ్. ఏం చేస్తాం. ఇక్కడ వంటవాళ్లు దొరకరు. ఈ వూళ్ళో ఆడవాళ్ళకి వంట పని తప్పదు అందుకే ఆవిడ వుండగానే నాలుగురకాలూ చెయ్యటం నేర్చేసుకో— నువ్వు ఒప్పుకోవేమో కాని. మీ వంటావిడ వంటకంటె మా అమ్మమ్మవంట వంద రెట్లు బాగుంటుంది' అన్నాడు సుధని యింకా ఉడికించే ధోరణిలో హాస్యంగా.

సుధ మాట్లాడలేదు. చెయ్యి చూసుకుంటూ కుర్చీలో కూర్చుంది.

కాళ్లు కడుక్కోటానికి పెరట్లోకి వెళ్లబోతున్న మధు, 'అయితే పనిచెప్పిన అమ్మమ్మ దానికి విరుగుడు చెప్పలేదూ' అన్నాడు.

'పులి మజ్జిగో ఏదో రాసుకోమన్నారు. అవన్నీ పూస్తే ఇంకేమవుతుందోనని భయం వేసింది...'

'ఏమీ కాదు. ఆవిడ చెప్పినదాన్ని అక్షరాలా పాటిస్తే మంచే జరుగుతుంది. పద. చక్కగా చెయ్యి కడుక్కురా. కాలేజీలో ఓ గమ్మత్తు జరిగింది....నీకెప్పుడు చెప్తానా, అని హుషారుగా వచ్చేసరికి నువ్వు ధుమ ధుమ లాడుతున్నావు' అని టవల్ భుజం




చూస్తున్నానుగా— పెద్దా-పిటి చిన్నాపిటి, గోళ్ళు కొరుక్కోవటం చాలామందికి అదో దురలవాటు. అనేక వ్యసనాల్లో ఇదొకటి. చిన్నప్పటినుంచి ఎలిమెంటరీ స్కూల్సులో చెప్పే మొట్టమొదటి పాఠం— గోళ్ళు కొరుక్కోడదు అని.

అయితే ఉదాసుగా, పిన్నా పెద్దా, అందరిలోనూ ఈ నఖప్రియత్వం కనబడుతుంది. పంటికి ఏదో ఇరుక్కున్నట్టు బాధపడుతూ, అద్దానివి ఇవతలికి తియ్యాలనే ప్రయత్నం నటిస్తూ, నఖభక్షణ చెయ్యటం చూస్తాం.

దీని చరిత్ర తిరగేస్తే, అనాదిగా ఆదిమ కాలంలోనే— మానవుడు పచ్చిమాంసాహారి కనుక— ఈ నఖభక్షణ మనకు లెక్కలోనిదికాదు. సుత్తీ కత్తీ పుట్టని ఆనాడు గోళ్ళు ఆత్మరక్షణ కూడా పనిచేసేవి. చీల్చటం, గిల్లటం, రక్కటం— ఇవి గోళ్ళతో చేసే వీరోచిత కృత్యాలు. వీటికోసం గోళ్ళు పెంచటం తప్పనిసరి అయింది.

యోగివాళ్ళు ఆత్మసంరక్షణార్థం గోళ్ళు పెంచుకుంటే, మగువలు సౌందర్యం ఇనుమడింప చేసుకుందుకి, గృహస్థరీత్యా తలలో పేలు కుక్కుకునేందుకు వినియోగిస్తున్నారు.

సారంగధరుణ్ణి వలచిన చిత్రాంగి— తన కోరిక తీరకపోగా గోళ్ళతో తనను తా రక్కుకుంది, గీరుకుంది. ప్రవరుణ్ణి బుట్టలో వెయ్యలేక వరూధిని బుడిబుడి రాగాలు తీస్తూ—

'కృపారహితాత్మక!— నీవు త్రోపనిచ్చోట
భవన్నఖాంకురము సోకె గనుంగొను'

అంటూ కళ్ళనీళ్ళ యేడుపు లేడ్చింది.

దీన్నిబట్టి— అటు సారంగధర ప్రవరాఖ్యులకూ, ఇటు చిత్రాంగి వరూధినులకూ కూడా గోళ్ళుండేవని రుజువవుతూ వుంది. శృంగార నాయికా నాయకులకు గోళ్ళు తప్పనిసరిగా ఉండాలన్నమాట. దంతక్షతాలతో పాటు నఖక్షతాలనూ విధిగా చెప్పాడు వాత్స్యాయనుడు.

సౌందర్యాతిశయానికి దంతసిరి, కేశసిరి లాగానే నఖసిరి కూడా ముఖ్యమే. పుప్పిపన్ను పీకించేసి మంచిది కట్టించుకోవచ్చు. బట్టతలయితే విగ్గులున్నాయి, తలనూనెలున్నాయి. గోళ్ళ విషయంలోనూ అటువంటి ఉపాయం, సాధన వుంటే ఎంత బాగుండును. ముఖ్యంగా సినిమా తారలకూ, నటీమణులకూ గోళ్ళు గొప్పవరప్రసాదం (అస్సెట్).

అటువంటి నఖసంపదను పళ్ళతో కొరికి ఎంగిలిచెయ్యటం ఎంతైనా అవమానకరం. పైగా —నఖభక్షణ ఆరోగ్యానికి భంగకరమని వైద్యశిఖామణులు ఏక కంఠంతో ఉద్ఘాటిస్తున్నారు.

పొద్దుట గెడ్డం గీయించుకుని గోళ్ళు తియ్యరా అంటే ఇష్టమొచ్చినట్టూ లాగిపారేశాడు. ఎన్నో హెచ్చుతగ్గులూ, వంకర టింకర్లున్నూ. సమయానికి క్లిప్పరు రాలేదు, కత్తెర కనబడలేదు. చికాగ్గా వుంది. మన్నించాలి— ఇప్పటిమట్టుకి నా గోళ్ళను సరిచేసుకోవటానికి పళ్ళు సాధనం తప్ప మరి గత్యంతరంలేదు.. ....

## జీవనరాగం

మీద వేసుకున్నాడు.

కళ్ళు తెరచిన సీతమ్మగారు, సుధ అక్కడ లేకపోయేసరికి,

'అయ్యో విడ్డూరమా, ఎంత చదువుకుంటేమాత్రం ఆడదయిపుట్టాక ఇంట్లో పనిపాటలు చేసుకోకుండా జరుగుతుందా. ఎంత అపురూపం అయితేమాత్రం పెళ్ళిచేసి పంపేటప్పుడయినా నాలుగూ నేర్పొద్దూ ఆ తల్లి.' అనుకుంటూ తనకి ఎలాగా తప్పదని లేచి కూర్చుని చేటముందుకి లాక్కుంది. కాస్సేపటి తరువాత నవ్వుకుంటూ వస్తున్న భార్యాభర్తల్ని చూసి ఓసారి మొహం చిట్లించి ముసుగు సవరించుకుంది. 'పెళ్ళయి నాలుగునెలలయినా కాలేదు. అప్పుడే వీడ్ని కొంగున కట్టేసుకుంది.' అక్కసుగా అనుకుంది మనస్సులోనే.

మధు నూతివేపు వెళ్ళాడు. సుధ వంటింట్లోకివెళ్ళి అలమారు తెరిచిన చప్పుడు కాగానే, 'ఏం కావాలీ— ఆ— అవన్నీ ముట్టుకోకు తల్లీ. కాస్త మజ్జిగచుక్క నే పోస్తానుండు,' అంటూ లేచిందిఆవిడ.

మజ్జిగ రెండు చేతులలో రాసుకుంటూ చెంగున నూతిపళ్ళెంమీదికి గెంతింది సుధ.

'సూరన్న ఏమయిపోయాడు — ఎక్కడా ఒక్క నీళ్ళచుక్కలేదు' అంటూ బాల్చీడు నీళ్ళు తోడుకుని మొహం కడుక్కొని, మరో బాల్చీ నీళ్ళతో కాళ్ళు కడుక్కొంటూంటే,

'అయ్యో అన్నీ పారపోశారా' అంటూ వచ్చింది సుధ.

'తోడిస్తానుండు' అని ఓ బాల్చీ నీళ్ళు సుధ చేతులమీద పోశాడు. ఆ నీళ్ళన్నీ అయిపోయేదాకా కడుక్కొని 'అమ్మయ్యో పోయింది బాబూ వెధవ నలుపు — చేతులు మజ్జిగవాసన వేస్తున్నాయి. మరి కాసిని నీళ్ళు తోడిపెట్టేయండి — సబ్బుతో కడుక్కొని వస్తాను' అంది.

మధు చిన్నగా నవ్వుకుని నూతిలోకి బాల్చీ వేశాడు.

(ఇంకా ఉంది)




జగద్రక్షకుడైన శ్రీ మహావిష్ణువు పాలకడలిలో శేషశాయిపైన పవ్వళించి, లక్ష్మీదేవితో ముచ్చటలాడుతున్నాడు. ఉన్నట్లుండి తను చెపుతూన్న మాటను సగంలోనే ఆపివేసి చెవియొగ్గి యేదో వినసాగేడు. తన నాథుడంత శ్రద్ధగా ఆలకించుచున్న విషయమేమాయని లక్ష్మీదేవి కలవరపడింది. 'యెవరైనా పరమభక్తుని మొర అయి ఉండవచ్చు. ఆనాడు గజరాజు మొర విన వచ్చినరోజు, ఈయన ఇలాగే ఓ నిముషం విన్నారో లేదో, అంతే సంగతేమిటో నాకు చెప్పకుండానే హడావిడిగా, చేతిలో ఉన్న నా చీరకొంగు పట్టుకొనే పరుగెత్తారు! ఆయన వెనకాతల పరుగెత్తేసరికి నాకు ఆయాసం వచ్చేసింది. ఆ కోవకే చెందిన భక్తుడి ఆర్తనాదం కాదుకదా?' అనుకొని సిరికూడా శ్రద్ధగా వినసాగింది.

అది భూలోకంలోనుంచి ఒక పేద కవి పిలుపు. వింటూంటే అతను విష్ణుమూర్తిని భక్తితో పిలుస్తూన్నట్లు లేదు. పైగా యెత్తిపొడుపులా ధ్వనిస్తూంది.

కవిగారు లక్ష్మీపతిని యెకిసారేస్తున్నారు. 'ఆహా విష్ణు జగద్రక్షకుడంటారు. నీకంటే శివుడే నయం. తన పోర్టుఫోలియోని శ్రద్ధగా నిర్వర్తిస్తున్నాడు. జగత్తుని రక్షించడం అంటే ఏమిటో అసలు నీకు తెలుసునయ్యా విష్ణుమూర్తీ?

'ఏమిటయ్యా నీ రక్షణ నీతిజ్ఞత? ఒకవైపేమో బ్రహ్మాండమైన సంపదా, మరొకవైపేమో దుర్భరమైన దారిద్ర్యమూ సృష్టించావు. ఈ రెండింటికీ జరిగే నిర్విరామ, నిరంతర పోరాటంలో ప్రపంచంలో సుఖశాంతులు కరవైపోతూంటే చూస్తూ ఊరుకొంటున్నావు.

'పైగా నీ కరుణాకటాక్ష వీక్షణముచే సంపన్నులయినవారు, నిరంతర దారిద్ర్యంతో నిస్పృహాయులైనవారిని గద్దల్లాగా పీక్కుతిని ఇంకా ధనవంతులవుతూంటే నీవు ఏమి చేయకుండా ఊరుకొంటున్నావు. ఏమి పక్షపాతమయ్యా — లోకపాలకులకుండవల్సిన లక్షణమేనా ఇది.

'ఓ జగద్రక్షకా, ఈ ప్రపంచాన్ని ఏ తూప్పుమీద పడేస్తున్నావోగాని మున్సంపదని యెప్పుడూ కొద్దిమంది చేతుల్లో మాత్రమే ఉంచి, కోకొల్లలుగా మిగిలిన వారికి దారిద్ర్యాన్ని మిగులుస్తున్నావు. ఈ పృథివిమీద సంపద అందరికీ సమానంగా ఉండేలా చూసి, మానవులకు సంతృప్తినీ, సుఖశాంతుల్ని కల్గించటం చేతకాదుటయ్యా నీకు?'

అంటూ అర్థం వచ్చేలాగ తన కవిత్వంతో వైకుంఠవాసుడ్ని నిలవేస్తున్నాడు కవిగారు.

కవిగారి ఛందోబద్ధమైన తిక్కరు విన్న లక్ష్మీదేవికి కవిగారి మీద బాగా కోపం వచ్చేసింది.

'చూశారా, చూశారా! ఇదంతా ఆ జ్యేష్ఠాదేవి ప్రోద్బలం లేకపోతే, మానవమాత్రుడు, అందులో కూటికి గతిలేనివాడు ఇలా నిలదీస్తాడా మిమ్మల్ని?'

అంది భర్త నుద్దేశించి.

'పిచ్చిదానా, కష్టాలను భరించలేక శక్తి కోల్పోయినప్పుడు మానవుడు తన కష్టాలకు దేముడ్ని బాధ్యుడిగా చేయటం సహజం,

మానవనైజం తెల్సిన మనము కోపగించుకొంటే యెలా' అని విష్ణుమూర్తి నచ్చచెప్పినవిగాదట.

'అయితే ఇప్పుడేమి చేయబోతున్నారు' అని ప్రశ్నించింది లక్ష్మీదేవి.

'ఏముంది, ఈ కవిగారి సమస్యకి రెండు పరిష్కార మార్గాలున్నాయి. అందులో మొదటిది, సులువయినదీ ఏమిటంటే ఈ కవిగార్ని సంపన్నునిగా చేయడం. అప్పుడు అతను ఈ పూటు కవిత్వం మానివేస్తాడు. అసలు భూలోకంలో దారిద్ర్యం, కష్టాలు అనేవి ఉన్నాయి అన్న సంగతే మర్చిపోయి ఏవో కులాసాగీతాలు రాసుకొంటూ ఆనందిస్తాడు.

ఇక రెండో మార్గమేమిటంటే, కవిగారి సలహా ననుసరించి భూలోకంలో అందరికీ సమానంగానే సంపద ఉండేలాచేసి, మానవులందరూ సంతృప్తికరంగా, ఏ ఒడుదుడుకులు లేకుండా జీవయాత్ర సాగించుతారేమో చూడవచ్చు. నీ సలహా ఏమిటి?' శ్రీరియొక్క సహకారం లేనిదే ఈ రెంటిలో ఏదీ అమలులోకి రాదు కనుక ఆమె సలహా కోరాడు విష్ణుమూర్తి.

'నాకెందుకో రెండో పద్ధతి నచ్చింది. అందులో నవీనత ఉంది. ప్రయోగాత్మకంగా చూసి. అయితే దానినే అమలులో ఉంచవచ్చును' కొత్త సోకడలయందుండే స్త్రీ సహజమైన ఉత్సాహంతో జవాబిచ్చింది లక్ష్మీదేవి

ఇంకేం, చూస్తుండగా భూలోకంలో ధనవంతులూ, పేదలూ అంటూ తెగలు పోయాయి. అందరికీ ఆదాయ వ్యయాలు సమంగానే ఉంటున్నాయి. ప్రతి వ్యక్తికీ తిండికీ, బట్టకీ, ఉండడానికి జాగాకీ లోటులేదు ఒకరికి పట్టుబట్టలూ, మరొకరికి చింకిపాతలూ అనేవి లేవు. ఒకరు మేడలోనూ మరొకరు పూరి గుడిసెలోనూ ఉండటం అనేవి లేవు. ప్రతి వ్యక్తి అసీ సమానమే.

అలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. భూలోకవాసులంతా రోజులన్నీ ఒక్కలాగే, ఏ విధమయిన ఒడిదుడుకులూ లేకుండా వెళ్లబుచ్చుతున్నారు.

ఇక ఫరవాలేదు. మనం ప్రవేశపెట్టిన కొత్త విధానం సాఫీగానే సాగిపోతూంది, అనుకొని నిట్టూర్పు విడిచాడు విష్ణుమూర్తి. రిలాక్సింగుగా ఉంటుంది అని లక్ష్మీదేవితో చదరంగం ఆట కుపక్రమించాడు. రెండు యెత్తులు వేశాడో లేదో మళ్లీ భూలోకంనుంచి ఒక ఆర్తనాదం వినిపించింది. ఈ మాటు విష్ణుమూర్తికి నిజంగా విసుపు కల్గింది. 'ఏమిటీ సొద' అని వినసాగాడు. పాత కవిగారి గొంతే అది.

'జగద్రక్షకా, ఇదెక్కడి సంకెళ్లు తగిలించావయ్యా మాకు. జీవితంలో నూతనత్వమంటే ఏమిటో మరచిపోయాము—ఏమిటీ యాంత్రికమయిన జీవితం? యంత్రాలు తయారుచేసే పరికరాలైనా తేడాగా ఉంటాయేమోగాని భూలోకంలో మానవుల జీవిత విధానాల్లో మాత్రం తేడా అంటూ ఉండటం లేదు. ఈ రోజు నిన్నటిలాగే గడుస్తూంది —రేపు ఈ రోజులాగే గడుస్తుంది కళలు నశించిపోయాయి. మానవుడు తన సృజనాత్మక శక్తినే కోల్పోతున్నాడు. ఆ రోజుల్లోలాంటి జీవముట్టిపడే చిత్రకళ ఏది? దేవదేవుని హృదయాన్ని కదిలించగల్గిన సాహిత్యమేది?

ఓ విష్ణుమూర్తీ, మానవుని సంతృప్తి అతని ప్రగతినే అవరోధిస్తుంది. జీవితంలో ఇంకా ఏదో రావాలి, దేన్నో పొందాలి అనే ఆకాంక్షలేని రోజుని జీవించి ఏమి లాభమయ్యా? పోటీవాడికన్నా తను ఏదో విషయంలో అధికుడ్నని నిరూపించుకోవడంలో ఉండే ఆనందమేకదా మానవుని సృజనాత్మక శక్తికి మూలాధారం? దాని కిప్పుడు తావే లేకపోయింది. నవరసభరితంగా ఉండవల్సిన మానవజీవితము, ఏమిటో యెప్పుడూ చప్పగా ఉంటోంది. నా చుట్టూ మనుష్యులు జడుల్లాగా తిరుగుతూంటే నాకు ఆదిమానవులే జ్ఞాపకం వస్తున్నారు. తరతరాలుగా మానవజాతి పెంపొందించిన ఆ సంస్కృతి, ఆ చైతన్యం ఏవి? ప్రభూ జీవచ్ఛవంలాగా నేనీ పృథివిమీద బ్రతకలేను, నన్ను నీలో చేర్చుకో' అంటూ రాగాలెడుతున్నాడు కవిగారు.

విష్ణుమూర్తి తల సంకించుతూ లక్ష్మీదేవి వైపు చూశాడు.

'ఎక్స్పెరిమెంటు ఫెయిలయింది' అందామె నవ్వుతూ.●





# ఒక ప్రళయ రాత్రి

**ఆర్. యం. చిదంబరం**

కుండపోతగా వర్షం కురుస్తోంది.

సీతాపతి వాచీ చూసుకున్నాడు. ఎనిమిది దాటింది. తూర్పుకు పోయేబండి రావటానికి ఇంకా గంట వ్యవధుంది. గాలివేగం కూడా ఎక్కువైంది. ఆనందాతిరేకంతో ప్రళయగీతి పాడుతూ సాగిపోయింది. ఆ పాటను ఆస్వాదిస్తున్నట్టు పిశాచాల్లా చెట్లు, చేమలు తలలూగించాయి. మబ్బును చీల్చి చెండాడుతూ, బంగారు కత్తిని ఝళిపించినట్టు మెరుపుల వెలుగులో ప్రకృతి భయంకరంగా గర్జించింది...రైలు పట్టాల మధ్య అప్పుడే నీరు చేరుకుంది.

ప్రకృతి ఎప్పుడు విజృంభించినా ఆయన మనసు గడగడలాడిపోతుంది. అది మదించిన ఏనుగులా ఘీంకరిస్తూ విరుచుకుపడితే దాన్ని ఎదిరించి నిలబడటం ఎవరి తరమూ కాదు.

దూరంగా సిగ్నలు పోలు కనిపించటం లేదు.

వర్షంలో దీపం వెలిగించినా మరుక్షణం ఆరిపోతుంది.

బండి ఆలస్యంగా వస్తే ఫరవాలేదు... కాని అసలు వస్తుందో రాదో?

పక్కస్టేషను నుండి ఆరుమైళ్ల పొడవున వున్న రైలుపట్టాల స్థితి ఎలా వుందో?

మరొకప్పుడైతే బండి రాకపోయినా చీకూ చింతా వుండదు. కాని రాఘవరావును మర్నాడు సాయంత్రంలోగా కలుసుకోలేకపోతే అతను మరి నెలరోజుల దాకా కనిపించడు. టూరు వెళ్లిపోతాడు... గంటకో చోటని తిరుగుతున్న మనిషిని ఎక్కడని పట్టుకోటం?...అతను పార్వతి పెళ్లికి మూడు లిస్తానన్నాడు...పెళ్లి మహా ప్రవాహంలా ముంచుకొస్తోంది. ఒక్కరోజు వృథా అయినా, కొంతపని నిలిచిపోతుంది. అందుకే వాన కురుస్తున్నా లక్ష్యపెట్టక మూడు గంటలు ముందుగానే స్టేషను చేరుకున్నాడు. తిరిగి వచ్చేటప్పుడు అవూరినుండి పెళ్లిక్కావలసిన సామగ్రి కొంత కొనుక్కురావచ్చుని, పాలేరు సుబ్బన్నను వెంట పెట్టుకు వచ్చాడు... సుబ్బన్న ఆయనకు నమ్మిన బంటు.

టెలిఫోన్ వచ్చిన చప్పుడైతే గదిలోకి పరుగెత్తారు.

రెండు నిమిషాలు మాట్లాడాక స్టేషను మాస్టరు పెదవి చప్పరించాడు.

'బండి వస్తుందా రాదా?...' అనడిగాడు సీతాపతి.

'మూడు నాలుగు గంటలు లేటుగా వస్తుందట...నన్నడిగితే వాన తగ్గాక్కాని రాదంటాను...'

ఆ మాటలు పూర్తవకముందే ఆకాశం గర్జించింది.

సుబ్బన్న చెవులు రెండు మూసుకుని 'బాబయ్యా!...ఇలాంటి వాన నా జెనమలో సూళ్లేదు...దేవుడు కూడా దడుసుకుని దాక్కునే ఈ వానలో రైలెట్టా గొస్తదండి?...ఇంటికి పోదాం, ఆలశ్యమైతే సీ రొచ్చేపి అడుగైనా ముందుకెయ్యలేం—' అన్నాడు.

ఆ మాటలు కూడా నిజం. ఇంటికి మైలున్నర నడవాలి. నేలజారుతుంది.

కటిక చీకటితో పురుగూ పుట్రావుంటే కూడా తెలియదు. ప్రాణం తాకట్టు పెట్టి బయలు దేరాలి.

'అది కుదరదు సుబ్బన్నా!...రాఘవరావును చూడక తప్పదు. బండెప్పుడు వస్తుందో నిశ్చితంగా తెలియనప్పుడు. దానికోసం కాచుక్కూచోటం తప్పించి గత్యంతరం లేదు...'

సుబ్బన్న తలగోక్కున్నాడు. ఈయన పట్టుదల మనిషి. అనుకున్నది అక్షరాల జరిగి తీరాల్సిందే...

సీతాపతి ఓసారి ప్లాటుఫారం ఆ చివర నుండి—ఈ చివరదాకా తిరిగి చూశాడు.

ఒక్క ప్రయాణికుడు కూడా లేడు. అంతా నిర్మానుష్యంగా వుంది.

స్టేషను మాస్టరు గది తలుపులు మూసి 'మీరు ఏదనుకుంటే అది చేసి తీరుతారని నాకు తెలుసు. అందుచేత నేనెలాంటి సలహో

యివ్వదలచుకో లేదు. వాన తగ్గేదాకా ఈ గదిలో వుండండి, నాకేలాంటి అభ్యంతరమూ లేదు.' అన్నాడు.

సీతాపతి అతని వంక కృతజ్ఞతగా చూశాడు.

మళ్ళీ టెలిఫోను వచ్చింది.

'మళ్ళీ ఏమంటాడు బాబయ్యా—బండి కూడా వానలో కొట్టుకుపోనాదంటాడా?—' అనడిగాడు సుబ్బన్న చుట్ట ముట్టించి. దుప్పటి కప్పుకుని గది మూలకు చేరుకున్నాడు.

'చాలు చాలు...నోరు ముయ్! నీ హాస్యానికి, వెటకారానికి వేళాపాళా లేదా ఏమిటి? ...గెడ్డానికి నిప్పంటుకుంటే చుట్ట కాల్చుకునేదాకా ఆగమన్నాడట ... అలా వుంది నీ వరస...' అని సీతాపతి మండిపడ్డారు.

'పక్క స్టేషనులో బండిని ఆపేశారు. ఇక ముందుకు నడవదు. వాన వెలిశాక్కాని ఏ సంగతీ తెలియదు.. నేను క్వార్టర్సుకు వెడుతున్నాను. మీరు జాగ్రత్తగా వుండండి. అని స్టేషనుమాస్టరు వెళ్ళిపోయాడు.

'సుబ్బన్నా!...నాతోబాటు నువ్వు కూడా బాధపడాల్సి వుంటుంది...అందుచేత నువ్వు ఇంటికి వెళ్ళాలంటే వెళ్ళొచ్చు...' అన్నారు సీతాపతి.

సుబ్బన్న పెద్దగా నవ్వాడు.

'ఏంటి బాబయ్యా!...ఈ వానలో నేను మాత్రం ఎలా గెల్లగల్ను?...తడిసిముద్దైపోతాను. జరంగిరంబస్తే నానాతంటాలూ... అదీకాక, పార్వతమ్మ పెళ్ళికి అన్ని ఏర్పాట్లు నేనే సేస్తానని పెతిజ్ఞ సేశాను...ఆడిన మాట నేనూ తప్పనండోయ్!...అందుకే జబ్బడకుండా యిక్కడే వుంటాను.'

చుట్ట పొగ గట్టిగా పీల్చబోయాడు. అదెప్పుడో ఆరిపోయింది. అయిదు అగ్గిపుల్లలు వెలిగించాక్కాని తిరిగి దానికి జీవం పోయలేకపోయాడు.

సీతాపతి కుర్చీలో కూలబడ్డారు.

పార్వతి పెళ్ళిని గురించిన ఆలోచనలు రేగిపోయాయి.

మొదట్నుంచి ఈ పెళ్ళికి అన్నీ విఘ్నాలే వస్తున్నాయి. పార్వతి పెళ్ళి చేసుకోనని, వుద్యోగం చేస్తానని మొండికెత్తింది... ఆడది ఆఫీసుల్లో మగవారికి సమానంగా వ్యవహరించటం ఆయన కలలో కూడా వూహించలేరు. ఆయనదంతా నియమబద్ధమైన జీవితం. అభిప్రాయాలు రాళ్ళలాంటివి. ఏ పరిస్థితులూ ఇంతవరకూ వాటిని మార్చలేదు. ఏ విషయంలోనైనా ఆయన నిర్ణయం తిరుగులేనిది. మాట కెవరూ ఎదురు చెప్పకూడదు.

అలాగే ఆయన దైనందిన కార్యక్రమం కూడా ఒక క్రమబద్ధమైనది.

ఉదయం నాలుగ్గంటలకు లేచి, మైలు దూరంలో వున్న కాలవలో స్నానంచేసి, సంధ్యావందనం, సూర్యనమస్కారాలు, అన్నీ ముగించుకుని, ఇంటికి తిరిగి వచ్చేసరికి ఏడున్నరవుతుంది ఒక్క గ్లాసెడు పాలు తాగి పూజామందిరంలో ప్రవేశిస్తే పదింటిక్కాని బయటకు రారు గంట గణగణమనగానే భార్య ఎక్కడున్నా పరుగెత్తుకొచ్చి హారతి అందుకోవల్సిందే! క్షణం ఆలస్యమైనా అగ్నిగోళమైపోతారు ఆ తరువాత రామాయణపారాయణం - భోజనానికూర్చునేసరికి సరిగ్గా ఒంటిగంటవుతుంది. అలా తంచనుగా ప్రతిదీ టైముకు జరగవలసిందే సినిమాలంటే ఏమిటో తెలియదు. ఆరోగ్యం ఆయనకు దాస్యంచేసింది

ఆయనకు 'భయపడి పెళ్ళికి ఒప్పుకున్న పార్వతి, తెచ్చిన సంబంధం వద్దు పొమ్మంది. ఏం?...

అతనికి చదువులేదా?...

ఎం. కాం. ప్యాసయ్యాడు...అదీ సెకండు క్లాసులో!

మరి ఉద్యోగం?...

ఓ కంపెనీలో అకౌంటెంటుగావున్నాడు, అయిదువందలు నెలకు జీతం—పసందైన ఆరోగ్యం...

అయితే సంస్కారం?...

మంచి కుటుంబంలో పుట్టి పెరిగాడు. అతని తండ్రి కూడా స్వతంత్రజీవి. లాయరుగా రాణించాడు. తనకు మల్లే చండశాసనుడు...కట్నం కూడా ఎక్కువ అడగలేదు.

అందచందాలు?...

మగవాళ్ళు అతని అందాన్ని మెచ్చుకుంటారు.

ఏ కోణంలోంచి చూసినా, ఆమె కన్నివిధాలా తగినవాడు...కాని పార్వతి నిరాకరించింది కారణం చెప్పదు.

సీతాపతికి ఏమీ అర్థంకాలేదు. కాలేజీలో చదువుకున్న అమ్మాయి. ప్రపంచం ఎలాంటిదో కొంచెమైనా అర్థం చేసుకుంటుంది. ఆమెను నిర్బంధించటమా?...ఈ సంబంధాన్ని కాలదన్నితే యుగయుగాల కలాంటి వరుడు దొరకడు. ఆమెకు నచ్చజెప్పటమేలాగని రాత్రింబగళ్ళు ఆలోచించి, ఏ వొడ్డుకూ చేరులోలేక, జీవితంలో మొదటిసారిగా ఓడిపోయినట్లు ఫీలయ్యారు.

అలావుండగా...

పార్వతి వున్నట్టుండి సరేనంది. ఊహించని విధంగా కనపడింది. ఆమెకు జ్ఞానోదయమైనందుకు సీతాపతిగారు సంబరపడ్డారు. పెళ్ళి ఏర్పాట్లన్నీ చురుగ్గా సాగాయి... కాని ఈ గాలివాన?...

ఆకాశం గర్జించింది.

ఓ మెరవుగొడలి చీల్చుకునిపోయింది.

సీతాపతి వాచీ కేసి చూశారు. పది న్నరైంది.

తలుపులు భళ్ళున తెరచుకున్నాయి.

ఉప్పెనలా గాలి గది వ్యాకమించి దీపాన్ని ఆర్పేసింది.

సుబ్బన్న గబగబ లేచి తలుపు వేయటానికి ప్రయత్నించాడు.

చీకట్లో ఎవరో లోపలకు దూసుకు వచ్చారు.

'ఎవరది?...దొంగ!...దొంగ!...' అరిచాడు సుబ్బన్న.

'దొంగ!...సింగివాదం!...ఊరుకోవయ్యా! పీడలా పట్టుకుంది వాన—అంతా తల్లకిందులయ్యేటట్టుంది.' అన్నాడా వ్యక్తి.

సుబ్బన్న తలుపువేసి, టేబిలు దగ్గరిగా వుంచి దీపం వెలిగించి ఆ కొత్త వ్యక్తి వంక చూశాడు. సీతాపతి కూడా ముందుకు వచ్చారు.

ఆ యువకుడికి పాతి కేళ్ళుంటాయి. చక్కటి టెరిలీన్ పాంట్ - చొక్కా, మెళ్ళో మైనర్ ఛెయిన్ — బంగారు వాచీ — చూట్టానికి కందంగా వున్నాడు విలువైన వస్తువును కోల్పోయినట్లు కళ్ళల్లో విషాదం. తల తడవకుండా వుండేందుక్కామోలు సిల్కు రుమాలు చుట్టుకున్నాడు,

సీతాపతి అర్థమైనట్లు తల వూపారు.

తూర్పుకు పోయేబండిలో వెళ్ళవలసిన మరో ప్రయాణీకుడు.. ఏదైనా ఊంట ర్వ్యూ కావచ్చు...లేక ఎవరైనా చావుబతు

కుల మధ్య వుండొచ్చు...

అతని లగేజీ వంక చూశారు.

ఓ పెద్ద సూట్ కేస్— బెడ్డింగు—చిన్న లెదరు హాండ్ బాగ్.

హఠాత్తుగా ఏ పెళ్ళిగ్గానో అందుకుని 'బయలుదేరిన వ్యక్తిలా కనపడటం లేదు.

వెలరోజులు తాపీగా, పెట్టె-బేడా సర్దుకున్నట్టుంది.

'అయామ్ సారీ!... బయట నిలబడలేక పోయాను. అందుచేత మీ గదికి రావలసి వచ్చింది!' అని వినయంగా సీతాపతితో అన్నాడు.

'కుర్రాయనా!...ఇది మా గదికాదు. పెజా సొమ్మెంలా అందరదీనూ. ఓసలు మాట్బరు గారు దానం చేసిపోయారు...మరేం ఫరవా లేదు. అలా ఆ పెట్టెమీద కూకో.'

'ఆ బట్ట లిప్పేసి పొడిబట్ట లేసుకో... ఇంతకూ ఏ వూరెళ్ళాలి?...' అన్నాడు సుబ్బన్న.

'థాంక్స్... విశాఖపట్నం ... అబ్బబ్బ!... దిక్కుమాలిన వాన! ఎప్పుడు కావాలో అప్పుడు, అక్కడ కురవదు. నీటిచుక్కలేక దేశంలో ఎన్నో ప్రాంతాలు బీటలు వారి పోతున్నాయి...పంటలు నాశనమవుతున్నాయి. ఓదవాళ్ళు దరిద్రు లవుతున్నారు.. అక్కడ కురవరాదూ?...' అంటూ హాండ్ బాగ్ లోంచి ఓ సిగరెట్టు తీసి వెలిగించాడు.

'ధర్మం ఒంటికాలుమీద నడుస్తుంటే జరగిదానివి జరుగుతాయి నాయనా!' అన్నారు సీతాపతి.

యువకుడు పొగలో మేఘాలు సృష్టిస్తూ 'ధర్మం?...ఏమిటీ ధర్మం?... అసలు దానికి నిర్వచనమంటూవుందా?... అది వూసరవెల్లిలాంటిది. కాలానుగుణంగా దాని అర్థం మారుతుంది...కొన్ని సంవత్సరాలక్రితం సహగమనం చేయకపోవటం అధర్మం. రాజ్యానికి రాజులేకపోవటం అధర్మం. ఆడది రెండోపెళ్ళి చేసుకోడం అధర్మం. హరిజనుడు బ్రాహ్మడి ఇంటో అడుగు పెట్టటం అధర్మం. ఇప్పుడలా కాదు. మనుష్యుల మనసులు వికసించాయి. మంచీ—చెడూ బాగా తెలుసుకో గలుగుతున్నారు... దాన్ని గుర్తించని వారు మాత్రం మంచి తనం మాసిపోయిందని వాదిస్తారు...క్షమించండి... ఇవేవీ మిమ్మల్నుద్దేశించి అన్న మాటలుకావు. జనరల్ గా ఏదో అన్నానంతే... మరో వుదాహరణ చూడండి ... అన్నట్టు మీ పేరు?'

# ఒక ప్రళయరాత్రి

'ఆయన పేరు చీతాపతిగారు...నా పేరు సుబ్బన్న— మరి నీపేరేంటి కుర్రాయనా?' అనడిగాడు సుబ్బన్న.

'సీతాపతి ... సీతాపతి...' అని యువకుడు ఏదో ఆలోచిస్తూ అనుమానంగా అటూ యిటూ చూశాడు. సీతాపతిగారు ఆశ్చర్యపోయారు.

'ఏమైంది కుర్రాయనా?...' అని సుబ్బన్న కూడా కంగారుపడ్డారు.

'అబ్బే!...ఏంలేదు పెద్దాయనా!... మా నాన్నపేరు కూడా అదే...'

'సరే! ... ఏదో చెప్పబోతుంటివి ... ఆగావు...'

'అదా!... అది... ఆ... అవును... మరో వుదాహరణ. ఓ అమ్మాయిని ఇష్టం లేని వాడికిచ్చి పెళ్ళి చేయాలని పెద్దలు నిశ్చయించారనుకుందాం; ఆ అమ్మాయి కుక్కిన పేనులా — బావిసలా—ఆ మొగుణ్ని అంగీకరించటం అధర్మం — తిరగబడి, తన యిష్టం వచ్చినవాణ్ణి చేసుకోటం ధర్మం...'

సుబ్బన్నకి మాటలన్నీ చిత్రంగా వినిపించాయి.

'ఉపన్యాసం బాగుందబ్బాయి. మినిట్టరువి కావలసింది...విశాకపట్నం ఎళ్ళకపోతే ఏం పోయిందీ?... ఎందుకీ వానలో ఒచ్చావు?... బండీరాదు. నువ్వెనక్కి ఎళ్ళనూ లేవు...'

'నిజమేనాండి సీతాపతిగారూ?...'

'అవున్నాయనా!... తూర్పుకుపోయే బండే ఇంకా రాలేదు. పదకొండుకు రావలసిన నీ బండి గురించి ఆలోచించేందుకే ఆస్కారం లేదు. తెల్లవారేదాకా ఈ గదిలో గడపగలిగితే ఆ దేవుడి దయ!... ప్రతి క్షణం భీకరంగా వుంది. ఓ పిడుగుపడితే చాలు. మనకూ, ఈ లోకానికీ అనుబంధం తీరి పోతుంది.'

అతని ముఖం వివర్ణమవటం ఎవరూ గమనించలేదు. మౌనంగా అటూయిటూ పచార్లు చేయనారంభించాడు. మధ్య మధ్య ఏదో గొణుకున్నాడు.

'అక్కడ మా నాన్నకు సీరియస్ గా వుంది. రెండునెలల కితం ఆయనకో ఆపరేషను జరిగింది. అప్పుడు నేను దగ్గరే వున్నాను. బాగా కోలుకున్నారు కూడా. మరో నెలరోజులు ఆయనకు పూర్తిగా నయమయ్యేదాకా వుందామనుకున్నా సెలవు దొరకలేదు. ఆపరేషను సరిగ్గా జరగలేదనుకుంటాను. మళ్ళీ తిరగబెట్టింది. ఆదుకునేవారెవరూ లేరు. పొద్దున్నే టెలిగ్రాం వచ్చింది. మూటాముల్లె సర్దుకుని బయలుదేరేసరికి ఆలస్యమైంది... నాపాలిటి యముడిలా ఈ వానిలా తగులడింది...సీతాపతిగారూ! మీకు సప్త పుణ్యక్షేత్రాలూ దర్శించినంత పుణ్యం వుంటుంది. ఒక్కసారి టెలిఫోన్ చేసి కనుక్కోండి. మరో గంటకు — రెండు గంటలకు—కనీసం వుదయానికైనా బండి వస్తుందేమోనని... నేను వెళ్ళితీరాలి ... నాన్నను కడసారిగా చూసితీరాలి. నా బతుకంతా బూడిదై పోతుంది ... ప్లీజ్!...' అతను పిచ్చివాడిలా జుత్తు పీక్కున్నాడు.

సీతాపతికి జాలేసింది.

ఆ యువకుడికి సాయం చేయాలనే వుంది. కాని ఎలా?...ఎక్కడి విశాఖపట్నం?...

అతని దగ్గరకు వచ్చి భుజం మీద చేతులు వేశారు.

'ధర్మాధర్మాల్ని గురించి నీ వుపన్యాసం విన్నాక, నువ్వు ధైర్యశాలివని, కష్టాల్ని చిరునవ్వుతో ఎదుర్కోగలవని అనుకున్నాను... కాని నువ్వు వట్టి పిరికివాడవు ... పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడు గుండెదిటవు కావాలి ... మీ నాన్నను తల్చుకుంటె నాక్కూడా బాధగానే వుంది కాని ఏం చేయటం? టెలిఫోను పనిచేయటం లేదు. తీగలు తెగిపోయుంటాయి.'

'ఓ మైగాడ్! ... ప్లానంతా చెడింది. ఇప్పుడేం చేయను?' అంటూ మరో సిగరెట్టు ముట్టించాడు.

'పాన్ అంటున్నావేమిటి కుర్రాయనా?' అనడిగాడు సుబ్బన్న!

'అదా?...ఏవిటో పెద్దాయనా! ... నాకు మతిమతిలో లేదు. నా మాటల్ని ఒక్కొక్కటి విడగొట్టి, చావగొట్టి, పెడార్థాలు తీయకు. నన్ను చంపకు.'

ఎవరో తలుపులు తట్టిన చప్పుడు...

యువకుడు ఛటుక్కున టేబిలు పక్కకులాగి, నెమ్మదిగా తెరిచాడు. వాన జల్లు గదిలోకి విరుచుకు పడింది.

'ఎవరది?...ఎవరు?... ఎవరూ కనిపించటంలేదు. తలుపు తట్టిన దెవరు? ఎవ

# బిన్నీ అసలు సిల్కు చీరలో స్వప్న లోకాల్లో ఆనందం



చీరను ధరించి
ఆహ్లాదాన్ని, సౌఖ్యాన్ని, అపురూప
లావణ్యతను అనుభవించాలని కోరే
సుందరాంగులంతా బిన్నీ అసలు
సిల్కు చీరలో ఆ స్వప్నాన్ని కన్నుల
పండువ చేసికొంటారు.
ఎంతో ప్రకాశవంతంగాను, దేదీప్య
మానంగాను, విశిష్టంగాను వుండే,
బిన్నీవారి అసలు సిల్కు చీర
మీ కల నిజం కావటమే.
బిన్నీ అసలు సిల్కు చీరలు
శుద్ధమైన జార్జెట్, సాఫ్ట్ సిల్కు,
షిఫాన్ సిల్కు

# ఒక ప్రళయరాత్రి

రది?...' అనరిచాడు.

జవాబు రాలేదు. గాలికి ఓడిలువిగొడి కాగితాలు ఎగిరి గంతులేశాయి.

సుబ్బన్న పరుగెత్తుకొచ్చి తలుపువేశాడు.

'నువ్వు మరేదగా వోమూల కూకోపోతే నిన్ను ఆ కిటికి వూసకు కట్టేయక తప్పదు...జాగ్రత!...అలా మజ్జుమజ్జు తలుపు తీస్తే ఈ గదంతా గోదారవుతుంది.'

పదకొండు దాటింది.

యువకుడు ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా ఓ పుస్తకం చదవ నారంభించాడు.

మరో అరగంటకు సుబ్బన్న పెద్దగా గుర్రుపెట్ట నారంభించాడు.

సీతాపతి కూడా కుర్చీకి జారబడి కొంటరువీూద కాళ్ళు చాపుకుని కన్నుమూశాడు. తన పిడికిలిలో చిక్కకుండా తప్పించుకున్నందుక్కావోలు గాలి, వాన చెట్టా పట్టాలు వేసుకుని ఆ గదిని వాలుగువైపుల నుండి ముట్టడించాయి.

* * *

మళ్ళీ ఎవరో తలుపు తట్టిన చప్పుడు.

యువకుడు మెల్లిగా లేచి చప్పుడు కాకుండా తెరచి బయటికి తొంగిచూశాడు.

'డామిట్!...అంతా భ్రమ!' అని విసుక్కుని, సిగరెట్టు ముట్టించి పుస్తకంలో పడ్డాడు. సగం తెరచిన కన్నులతో అతని ప్రతి కదలికను, సూక్ష్మంగా, దొంగతనంగా గమనిస్తున్న సీతాపతికి ఇదంతా అయోమయంగా కనిపించింది. మొదట్నుంచి అతని మీద ఆయన కనుమానంగానేవుంది. అతని మాటలు, చేతలు కృత్రిమంగా వున్నాయి. ఈ ప్రళయరాత్రిలో పరుగెత్తుకు రావటం, ఎక్కడో నాన్న ప్రమాదస్థితిలో వున్నాడనటం— మధ్య మధ్య ఎవరూ లేకపోయినా తలుపు తెరచిచూడటం. పిచ్చివాడిలా అటూయిటూ తిరగటం. అన్నీ విచిత్రంగా కనిపించాయి.

అసలు అతనిక్కడ కెందుకొచ్చినట్టు?

చూపులు అమాయకంగా వున్నా, అట్టడుగున ఏదో రహస్యం దాగివుందన్న భావం ఆయనలో దృఢతరమైంది. నిద్రపోతున్నట్టు నటిస్తూ అన్నీ కనుక్కోవాలి...అతి కష్టం మీద గుర్రు కూడా పెట్టసాగారు.

సిగరెట్టు ఆర్పి, వేలిమీద పడేస్తే [illegible] అడుగు మీద అడుగువేసుకుంటూ వెళ్ళి కిటికీ తలుపులు తెరచి ఆ చీకటిలో ఏదో వెలుగు కోసం చూశాడు ... అనంతంలా సాగిపోతున్న ఆ మట్టిరోడ్డు — గజగజ వణకే చెట్లు — మెరుపులు—ఉరుములు—అంతకు తప్పించి అతనికేం కనిపిస్తుంది? వినిపిస్తుంది?

ఎవరి కోసమేనా ఎదురుచూస్తున్నాడా?

తన వైరికాని, ఈ వానలో రావాలనుకున్నా ఎవరూ రాలేరు.

కిటికీ తలుపులు మూసివచ్చి యథాస్థానంలో కూర్చున్నాడు.

సీతాపతికి చటుక్కున ఓ ఆలోచన తట్టింది.

అతను ఓ భగ్నప్రేమికుడు కావచ్చు... ఆవేశంలో తన్నుతాను మరచి, అందు బాటులో వచ్చిన స్వర్గాన్ని దూరంచేసిన ఆ వ్యక్తిని, కసిగా, లోతుగా పొడిచి, చంపి వుంటాడు...ఆ తరువాత కాని తను చేసిన పని ఎలాంటిదో తెలిసి వుండదు. పోలీసులు— చేతికి సంకెళ్ళు — కోర్టులో విచారణ — బంధువులు — స్నేహితులు — అందరముందు తలవంపులు — ఆపైన ఉరిశిక్ష — అన్నీ దెయ్యాల్లా చుట్టిముట్టి లయ, తాళంలేని భీకరనృత్యం చేసి అతన్ని వున్మాదుణ్ణి చేసుంటాయి. వాటి బారి నుండి తప్పించుకోటానికి శక్తికొలదీ పరుగెత్తుకుని వచ్చుంటాడు.

పోలీసులు వెతుక్కుంటూ వస్తున్నారేమో నని, ఏ చిన్న చప్పుడైనా భయపడి బయటికి చూస్తున్నాడు.

ఖూనీ చేయకపోయినా, కనీసం దొంగతనమైనా చేసుంటాడు. ఆ సూట్‌కేస్ నిండా బట్టలు, బంగారునగలు, వెండిగిన్నెలు కావచ్చు— ఈ రాత్రి బండికే ఏ విశాఖపట్నమో, వెంకమ్మ పూరో వుడాయిస్తే మరి ఆచూకీ దొరకదు. యువకుడు మంచి ఘటికుడే!... పైపెచ్చు ధర్మమంటే ఏమిటో తనకు బోధిస్తున్నాడు!... ఇంకా నయం. దొంగతనం చేసి డబ్బు గడించి, ఇల్లూ కారూ కొనటం కూడా ధర్మమన్నాడు కాదు...నిద్రపోవటానికి వీల్లేదు. కళ్ళల్లో వత్తులు పెట్టుకుని కాపలా వుండాలి.

ఆకాశం మళ్ళీ గర్జించింది. ఎక్కడో పిడుగుపడి వుంటుంది.

ఆయన చేతులు వణికాయి — తల గిరగిర తిరిగింది గుండెను ఎవరో ఆడకత్తెరలో పోకచెక్కలా తుత్తునియలు చేస్తున్నట్లని పించింది. కొంతసేపు రెండు చేతులతోనూ తలపట్టుకుని కూర్చున్నారు ... దిగజారిన ధైర్యాన్ని కూడగట్టుకుని చదవనారంభించారు.

'ప్రియమైన రవణకు'

నీ వుత్తరం అందుకోగలిగాను...నీ దగ్గర్నుండి జవాబు వస్తుందో రాదోనని నరక బాధ ననుభవించాను మగవారు మాటల్లో దిట్టలుకాని చేతల్లో కారన్న అభిప్రాయం నా కుండేది. దాన్ని పూర్తిగా మార్చేశావు

పెళ్లికి ఒప్పుకోవద్దని రాశావు...అదెలా కుదురుతుంది? పెదనాన్న సెలక్టు చేసిన వరుడికి ఎలాంటి వంకా పెట్టలేను. అలాంటప్పుడు ఒక్కసారిగా నిరాకరిస్తే ఏమను కుంటారు?...అందుకని ఈ వివాహానికి నా అంగీకారం తెలియజేశాను... పాపం!... నా మనసు మారిందని ఆయన సంతోషించి, ఎగిరి గంతువేసి ఏర్పాట్లన్నీ చక చక జరిపిస్తున్నారు వేళకు తిండి తినటం లేదు. కంటికి విశ్రాంతివ్వడంలేదు. ఆయన్ని చూస్తే నా కెంతో బాధగావుంది ఒక్కొక్కప్పుడు అలాంటి సహృదయుణ్ణి మోసం చేయటం అన్ని పాపాలకూ సమానమని పిస్తోంది. కాని ఒకరికోసం మనం బలి కాలేము కదా!...ఆయన అభిమానానికి, అనురాగానికి ప్రతిఫలం యివ్వలేను...ఏదేలా వున్నా నా నిర్ణయం మారదు. ఇక మన పథకం యిది.

వచ్చే మంగళవారంనాడు పెదనాన్న పెద్ద పొద్దు రాత్రి తొమ్మిదిగంటల బండికి వెడుతున్నారు పెళ్లి ఖర్చులకని ఎవడో స్నేహితుడిదగ్గర్నుంచి సాయం పొందేందుకు... పదకొండుగంటల బండికి ఇద్దరం వెళ్లిపోవచ్చు 'ఎలాగా?' అని మాత్రం అడగకు. ఈనాటివరకూ నేను ఆడినమాట తప్పలేదు. నువ్వు మాత్రం ఎన్ని అడ్డంకులున్నా తప్పించుకుని వచ్చితీరాలి ఇరవై నాలుగుగంటలూ 'హౌస్ అరెస్ట్'లో వుండే నేనే రాగలిగినప్పుడు నీలాంటి స్వేచ్ఛా విహంగానికి ఎలాంటిఅవాంతరమూ వుండదు. ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే మన పథకం నెరవేరకపోతే కొంప మునుగుతుంది. పొరపాటు జరిగాక పశ్చాత్తాపపడి లాభం లేదు....

నీ పార్వతి.'

సీతాపతి తేరుకునేసరికి కాలం నిలిచి పోయినట్లయింది.

ఎవరీ రవణ?

కొంచెం ఆలోచించగా ఆయనకు జ్ఞాపకం వచ్చింది...అవును...పార్వతితల్లి లక్ష్మి ఒక సారి ఈ రవణగురించి ప్రస్తావించింది... పార్వతి ఇంటరు ఫస్టుక్లాసులో ప్యాసైంది. పక్కింట్లో వున్న రవణ బి. యస్. సి. అదే క్లాసులో ప్యాసయ్యాడు తమ్ముడిదగ్గరకు వెళ్లినప్పుడు అతన్ని చూసిన జ్ఞాపకం కూడా వుంది. తెలివైన కుర్రాడు ఆశయాలకు, ఆవేశాలకు పుట్టిల్లని తమ్ముడు వర్ణించగా విన్నారు. పార్వతిపై చదువు గురించి ఆ యింటో అలుమగల మధ్య తర్జనభర్జనలు జరిగాయి.

'దాని కింక చదువు అనవసరం. అది ఉద్యోగాలు చేయనక్కర్లేదు. మంచి సంబంధం చూసి ఆ మూడు ముళ్లూ పడేట్టు చూడండి.' అని లక్ష్మి తొందరపడింది.

తమ్ముడు అందు కంగీకరించలేదు. పార్వతిని డాక్టరుకు చదివిస్తానన్నాడు.

ఈ తీరని సమస్యకు జవాబు విధి కనుక్కుంది

ఉన్నట్టుండి తమ్ముడు గుండెపోటువలన కన్ను మూశాడు.

అతను ఏ కూ చింతా లేకుండా 'రేప' న్నది లేనట్టు జీవించినవాడు కనక ఆర్థికంగా స్వతంత్రంగా నిలబడే శక్తి లక్ష్మికి లేకపోయింది. పార్వతి వుద్యోగానికి వెడతానంది లక్ష్మి ఒప్పుకోలేదు.

చివరికి సీతాపతి ఇద్దరికీ నచ్చచెప్పి, పట్నంలో వున్న తమ్ముడి ఇల్లు అమ్మేసి స్వగ్రామానికి తీసుకువచ్చారు. పార్వతి ముభావంగా వుంటూవచ్చింది.

సీతాపతి ఛాందసత్వం ఆమెకు నచ్చ లేదని లక్ష్మి వూహించింది. కాని అక్కడ వుండితీరాల్సిందే. సీతాపతి భార్య కూడా మంచిదే...కాలక్రమంలో అన్నీ సర్దుకుంటాయని లక్ష్మి తన్నుతాను ఓదార్చుకుంది.

అయిదారు నెలల తరువాత పార్వతి పెళ్లి ప్రస్తావన వచ్చింది.

'మా పక్కింట్లో వుండేవాడు రవణ. చక్కటి కుర్రాడు. పార్వతంటే అతనికో అభిమానం. ఆ సంబంధం చూస్తే బాగుంటుంది' అంది లక్ష్మి.

'సరే! ... అతను ఏం చేస్తున్నాడు?' అనడిగారు.

'ఎక్కడో స్కూల్లో టీచరుగా వున్నాడు.. కాని పైకొస్తాడన్న నమ్మకం నాకుంది' అంది లక్ష్మి.

పార్వతి కూడా అక్కడే వుంది. సీతాపతి ఆమె వంక చూశారు. ముఖంలో ఎలాంటి మార్పులేదు.

రవణ ఆస్తిపాస్తుల్ని గురించి అడిగారు.

సున్న...మరి కుటుంబ గౌరవం?

తల్లి మంచిదే...కాని తండ్రి నిలకడ లేని మనిషి—నీతిని నమ్మనివాడు. జీవితంలో ఎన్నో మచ్చలు...

కాని పెళ్లిచేసుకునేది తండ్రిని కాదుకదా!... లక్ష్మి వాదం...

'కొంపతీసి ఏదైనా ప్రేమ గీమ నడిచిందా ఏమిటి?...' లక్ష్మి మాట్లాడలేదు. 'ప్రేమించి పెళ్లిచేసుకోటం అంటే తెలివితక్కువపని మంచికటుండదు... పెళ్లయ్యాక అభిప్రాయభేదాలు ఎన్నిరకాలో విభజిస్తూ కూర్చోటంతో సరిపోతుంది'

సీతాపతి ఒప్పుకోలేదు.. ఆయనకెలాగూ సంతానం లేదు. అందుకని పార్వతి పెళ్లి వైభవంగా జరపాలనుకున్నాడు.

'రత్నంలాంటి సంబంధం నేను తీసుకొస్తాను చూడు...' అన్నారు.

అన్నమాట నిలబెట్టుకున్నారు కూడా.

పార్వతి ఈ పెళ్లి పద్దనటానికి కారణం ఆయనకిప్పుడర్థమైంది.

ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికెరుక?... అమాయకంగా కనిపించినా, పార్వతి తన గొంతుకోయటానికి వెనుదీయలేదు. తన ఆత్మగౌరవానికి చిచ్చుపెట్టింది. సీతాపతి వళ్లు భగభగమంది.

కళ్లు రెండూ ఎర్రబడ్డాయి.

రవణను తట్టిలేపి సుబ్బన్న సాయంతో చావగొట్టి ఆ వానలో — తుఫానులో — ఆ చిక్కటి చీకటిలో బయటికి తరిమివేయాలనిపించింది

కాని... కాని ... అందువలన తనకొరిగే దేమిటి?

పార్వతి ఆత్మహత్య చేసుకుంటుంది...జీవి






# ఒక ప్రళయరాత్రి

తాంతం ఆ పాపం తన్ను వెంటాడుతుంది... ఎన్నో ఘన కార్యాలు సాధించి, ఆశయాల్ని ఆచరణలో పెట్టాల్సిన రవణ ఎందుకూ కొరగాని పురుగులా ఈ ప్రళయ రాత్రిలో ప్రాణాలు విడుస్తాడు. వద్దు... వద్దు...

వారిద్దరికీ మధ్య వున్న ప్రేమ తనకు తెలియదు. తను మనసారా మంచి తలపెట్టాడు కాని ఎవరికి కీడెంచలేదు. పర్యవసానానికి తను బాధ్యుడు కాడు.

రవణ ఎవరికోసం ఎదురు చూస్తున్నాడో ఇప్పుడు తెలిసివచ్చింది.

అతను దొంగ కాడు...హంతకుడు కాడు...అంతకంటె కూడా పాపాత్ముడు.

అహం తలెత్తి బుసలు కొట్టింది.

తన పంచన చేరిన తమ్ముడి కూతురు ఎవరితోనో లేచిపోయిందంటే తన కెంత అవమానం?...అంతకంటె విషం తాగి చావటం మేలు...

తన నిర్ణయానికి తిరుగనేది వుండకూడదు. ఆనాటివరకూ అలా నడుస్తూ వచ్చింది ఇకముందు కూడా అంతే...అదీ కాక, కుర్రతనంలో మంచి చెడ్డలేం తెలుస్తాయి?...అనుభవంవున్న తనలాంటి వాళ్లు సరైనదారి చూపించాలి. మొదట్లో కంట తడిబెట్టినా, పోనుపోను అర్థం చేసుకుంటారు.

ఈ రవణను వదల్చుకోట మెలాగ?

ఈ గది కూలి వాడు చస్తే ఎంత బాగుండును?...పీడ వదలుతుంది.

పార్వతి మనసు తెలిసింది. ఇంక ఒక్క క్షణం కూడా ఆమెను ఒంటరిగా వదలకూడదు. పెళ్లిచేసి ఆ కుర్రాడి చేతిలో పెడితే అంతా సర్దుకుంటుంది.

ఆయన తృప్తిగా నవ్వుకున్నారు.. తను పెద్ద గండంనుండి బయటపడ్డారు. భగవంతుడికి నమస్కరించారు.

* * *

వెయ్యి అంతస్థుల మేడ కూలి పోయినట్టు ఓ భయంకర గర్జన — సుబ్బన్న, సీతాపతి ఇద్దరూ ఒక్కసారి ఉల్లిపడి కళ్లు తెరిచారు.

ఏదో అజ్ఞాతశక్తి ఇద్దర్నీ బయటికి తొక్కుని వచ్చింది.

అంతా అయోమయం...

సుబ్బన్న తేరుకుని చూశాడు.

ఆ గది కూలిపోతోంది

'అయ్యో!... ఆ కుర్రాయన?' అనరిచాడు.

'సీతాపతిగారూ! ... ఆ యబ్బాయి?' అంటూ ముందు కురకబోయాడు.

సీతాపతి అతని చేయి పట్టుకుని ఆపారు. సుబ్బన్న గింజకున్నాడు ఆపట్టులో వెయ్యి ఏనుగుల బలం కనపడింది సుబ్బన్న ఆశ్చర్యపోయాడు. ఆ ముసిలాడికింత బలం ఎక్కణ్ణుంచి వచ్చింది? అసలు తన్నెందు కాపుతున్నారు?...ముసిలాడికి మతిచెడిందా?.

'అయ్యో...ఏమిటిది? ...నన్నొదలండి... ఆ కుర్రాయన సచ్చిపోతున్నాడు.

ఏంటీ మొరితనం?...అని శక్తినంతా కూడగట్టుకుని సుబ్బన్న మరోసారి ప్రయత్నించాడు—ఒక్క అంగుళం కూడా ముందుకు కదలలేకపోయాడు.

'అరి దుర్మార్గుడా!...నువ్వు...నువ్వు...'

సుబ్బన్న పళ్ళు పటపట కొరికాడు.

'ఆ కుర్రాయనమీద నీకేం పగ?...'

అప్పటికే అంతా పూర్తయింది

పెంకులూ—ఇటుకలూ—మట్టి బెడ్డలూ వాసాలూ.

నరకబాధ ననుభవిస్తున్న రవణ ఆర్తనాదం.

సుబ్బన్న మృతశరీరాన్నైనా బయటకు తియ్యాలని గాబోలు పరుగెత్తాడు.

సీతాపతి ఈసారి అతన్నాపలేదు.

తలవంచుకుని నిలబడ్డారు.

ఆ సమయంలో సీతాపతి మనసులో ఎలాంటి ఘర్షణ జరుగుతుందో ఎవరూ కనుక్కోలేరు. కాని,

ఆయన ముఖంనిండా తృప్తి అలుముకుంది

వానకూడా వెలిసింది.

# శిశుహత్య - శిశురక్షణ

కాగంగి అనే వూరులో దారిద్ర్యాన్ని భరించలేక, ఒకవ్యక్తి తన పిల్లలో ముగ్గురుని నూతిలో పారేశాడట. నాలుగో పిల్లని పడవేయగానే దారిన పోయే ఒకతను చూసి, ఆ పిల్లని రక్షించాడట. ముందు పడేసిన ముగ్గురూ చచ్చిపోయారు. వాళ్ళకి తిండానికి ఏమీ ఇవ్వలేని ఆ తండ్రి మనోవేదన శిశుహత్యలకు దారితీసింది— దారిద్ర్యం భరించరానిది. ఈ విషాద సంఘటన యీనెల ఆరో తేదీన జరిగింది.

## శిరోఘాతాలు

అక్టోబర్ 31వ తేదీ తెవెడి అనే గ్రామంలో ఆటవికులను లెఫ్ట్ కమ్యూనిస్టులు సహానేంవరకి ఎన్నికల ప్రచారం చేస్తున్నారట. ఆ మీటింగ్‌కు



వెళ్ళిపోతున్న కొంతమంది ఆటవికుల్ని కాంగ్రెసు పక్షపాతులు ఆపారని, ఘర్షణ ఎక్కువైపడంవల్ల ఆ జాతివారు బాణాలు ప్రయోగించారనీ, దానిలో ఓ అయిదుగురు కాంగ్రెసువారికి తీవ్రగాయాలు తగిలాయనీ తెలిసింది. కాంగ్రెసు వారు కాల్పులు సాగించడం వల్ల ఆటవికుల్లో యిద్దరు అక్కడే మరణించారట. ఏమిటీ జుగుప్సాకరమైన సంఘటనలు? ఇదంతా దేశసేవ చేదామనే ఆరాటమేనా?

## జోహార్ - నింద!

హిందీనటుడు ఐ. ఎస్. జోహార్ హాంకాంగ్ వెళ్ళి రేడియో ఇంటర్వ్యూలో మాట్లాడుతూ హిందూదేశం నైసర్గికంగానూ, నైతికంగానూ, కూడా పరిశుభ్రతలేని జుగుప్సాకరమైన దేశం అని అన్నారట. అలా అన్నందుకు హిందూదేశం తనని ఏమీచేయలేదు, మహా అయితే తనకి యికమీదట పాస్‌పోర్టులు ఇవ్వడం మానివేస్తుందని అన్నారట. ఆయన ఉపన్యాసం టేపురికార్డు చేసి, హాంకాంగ్‌లోని హైందవులు అక్కడ ఎంబసీకి ఆక్షేపణ తెలియజేసి, ఆ టేపు హిందూదేశానికి పంపారట—

## కూతురిని చంపిన తండ్రి

బ్లాక్‌మాజిక్ (ఒకదుష్టవిద్య) తన కూతురు నేర్చుకుంటుందన్న కోపంతో ఆమెతండ్రి ఆమెతల నరుగ్గొట్టి, చంపేసి, శవాన్ని దగ్గరలోవున్న ఒక అడవిలో ఓచోట పాతివేశాడట. పోలీసులు శవాన్ని బయటకిలాగి, అతన్ని అరెస్టు చేశారు— ఇది రాక్షసంకాదూ!

ఈ దారుణం అక్టోబరు 21న సూరత్ ప్రాంతంలో జరిగింది.

## విందు, ఎరుపు, నలుపు

జావాలో ఒక గ్రామంలో విందు భోజనం చేసి, హమ్మయ్య అనుకునే లోగా వాంతులు ప్రారంభమయ్యాయట. ఆ అన్నం తిన్న ముప్పయ్యెనిమిది మంది చూస్తుండగా నేల విూదపడి విలవిల్లాడి ప్రాణాలు కోల్పోయారట. వారి శరీరాలు మొదట ఎర్రగానూ, తరువాత నల్లగానూ మారిపోయాయట.

## మెత్త వ్యాపారం

ఢిల్లీలో సదరాబజారులో మొదటి తరగతి రైలు పెట్టెలలో కూర్చోడానికి వేసే కుషన్లు అమ్ముతుండగా ఒక కుర్రాణ్ణి పోలీసులు పట్టుకున్నారట. తనకి ఏణ్ణర్ధంగా అదే వ్యాపారమనీ, ఉత్తరప్రదేశ్‌లో తిరిగే రైళ్ళలో కుషన్లు అనవసరమనీ అందుకే తను, తన అసిస్టెంటూ అవన్నీ కోసితీసే రైలు ఢిల్లీ చేరేలోగా నిర్ణీత స్థలాల్లోనే పడేస్తామనీ, తన ఏజంటులు అవన్నీ ఏరి ఒకచోట వేస్తారని అతను చెప్పాడట. తను ఒకవిధంగా ప్రభుత్వం చేసే యీ ఖర్చు అనవసరం — మొదటి తరగతిలో జనంలేని వాడికి కుషన్లు ఎందుకు అనే విషయం తెలియజేసినట్టు అతను ఆనందించాడట. నగరంలో వెదికి అతన్ని పట్టుకున్నారట.






## మెకన్యూకి దయ్యం!

డాగ్‌హేమర్‌షోల్డ్ స్మారకార్థం కట్టిన మెమోరియల్ కాపలాదారుడు ఆ ప్రదేశంలో దయ్యాలు తిరుగుతున్నాయని వెల్లడించాడు. ఒకనాటిరాత్రి వున్నట్టుండి ఆభవంతిలో లైట్లన్నీ వెలిగాయనీ, తుపాకి పేల్పులు, మాట్ల చప్పుళ్ళూ వినబడ్డాయనీ తన భార్య దయ్యాలను చూసి భయపడి చెప్పిందనీ అంటున్నాడు. చివరి కతను ధైర్యం చేసి రెండు చేతులూ జోడించి, ''ఓ దెయ్యాల్లారా. నామీద ఆగ్రహించకండి. నేను కేవలం యిక్కడ నౌకరునే'' అని ప్రార్థించినట్టూ, వెంటనే అరుపులూ అవీ తగ్గిపోయినట్టూ అతనే చెప్తున్నాడు

## గర్భస్రావం హత్యా? కుటుంబనియంత్రణా?

ఒక సంవత్సరానికి మనదేశంలో సుమారు లక్ష మంది గర్భవతులు గర్భస్రావం చేయించుకోడంలో ప్రాణాలు పోగొట్టుకుంటున్నారనీ దీనికి కారణం నైపుణ్యం, శిక్షణ లేని వర్గం చేత అలాంటి పనులు చేయించుకోడమేనని యూనియన్ హెల్త్ మినిష్టరు డాక్టర్ చంద్రశేఖర్ అంటూ, ''గర్భస్రావం కుటుంబ నియంత్రణలో జమకాద''ని అన్నారు. అది శిశుహత్య క్రిందే జమా?

## పెన్షన్ విముక్తి

పెరియారంగే అనే అరవైయేళ్ళావిడ పెన్షన్ తీసుకోడానికి కోయంబత్తూరు సబ్‌ట్రెజరీకి చేరుకువచ్చి తనవంతు కోసం నిరీక్షిస్తూ ప్రాణాలు పోగొట్టుకుందట. (యీనెల 4వ తేదీన) అంతే ఆ చావు స్వాభావికమేనని ఆశాఖ రికార్డు చేసింది.

—ఫాలాక్షుడు



'గొప్పవారిగోత్రాలు'లో ఇందిర, శేషగిరిరావు.

చిత్రసమీక్ష:

# గొప్పవారిగోత్రాలు

ఈ మధ్య చలనచిత్ర రంగంలో 'కొత్తదనం' అనే మాట చాలా చోట్ల వినిపిస్తున్నది. ఇదివరలో, అనుభవ మున్నవాళ్లు కొత్తవాళ్లతో చిత్రాలు నిర్మించారు. విజయాన్ని సాధించారు. ఇప్పుడు కొత్తవాళ్లు అమితోత్సాహంతో అంతా కొత్త చిత్రాన్ని నిర్మించారు అభినందించాలి!

మూర్తి సకల దుర్గుణ సంపన్నుడు, గొప్పవాడుగా చెలామణీ అవుతుంటాడు. అతని చుట్టూ మరికొన్ని పీడపురుగులు చేరాయి. ఒక దేశ సేవకుడి పేరుని కలుషితం చేస్తూ చేయరాని పనులు చేస్తుంటారు రాజ్ కుమార్ అదే ముఠాలోని వాడు అయినా, రాధ కోసం మంచివాడయి మళ్లీ ఆమె కోసమే చెడ్డవాడవుతాడు 'వీళ్లందరి గుట్టూ మిస్టర్ మంత్ రట్టు చేయడంతో గొప్పవారి గోత్రాలు బయల్పడి గవర్నమెంటు వారి ఆతిథ్యాన్ని అందుకుంటారు. దొంగ నోట్లకి డిజైన్ తయారు చేసినవాడు కథానాయకుడు గనక అతన్ని వదిలేస్తారు!

ఈ మధ్యన వచ్చే చాలా నాటకాల్లోని కథే ఇందులోనూ వుంది. కథలో కొత్తదనానికి 'చిత్రీకరణ' పదును పెట్టలేకపోయింది. నటీనటులు నడిచిన దారి బాగున్నది. నడిపించిన తీరులో అమితమయిన నేర్పు వుంది! కథానాయకి తండ్రితో ఎడబాటు, ఆ తండ్రి బార్ లో పదిమంది ఎదుటా కూతురితో సంబంధం ఉన్నవాడిని దూషించడం లాంటి వాటికి ఎదిగి వున్న ప్రేక్షకులు జీర్ణించుకోవడం కష్టం. మొత్తంమీద వినూత్న పోకడల చిత్రం గనక జనం ఆదరిస్తారు!

తగిన పాత్ర లభిస్తే సామర్థ్యం చూపించగల నటుడు అంజిబాబు. అతని నటన మెచ్చుకోతగ్గది రాజ్ కుమార్ గా శేషగిరిరావు నటన పాత్రోచితంగాను, సహజంగాను వుంది. జి. యస్. మూర్తి పాత్ర అవధుల మేరకు చక్కగా నటించాడు. రిక్షా నాగయ్యగా గౌతమ్ నటన ప్రశంసనీయం ప్రభాకర్ హాస్య నటుడుగా రాణిస్తాడు. కథానాయిక పాత్రని ఇందిర ప్రతిభావంతంగా పోషించింది. సురేఖ రోజ్ పాత్రకి గుబాళింపు తీసుకు వచ్చింది. ఇతర ముఖ్య పాత్రల్లో నారాయణస్వామి, సుందరరామయ్య, భానుప్రసాద్, రామప్రసాద్ లక్ష్మి, దేవిశ్రీ, ధనశ్రీ, మాస్టర్ ఆదినారాయణ మొదలయినవారు కనిపిస్తారు

పాటల కూర్పు, సంగీతం చేర్పు రమ్యంగా వుంది కొన్ని పాటలు, ముఖ్యంగా 'పేరు వాయి లేని బ్రతుకు' చాలా హాయిగా వుంది కథని నేను రాశారు. మాటలు, పాటలు అనిసెట్టి టైటిల్ సాంగ్ వక్కలంక లక్ష్మీపతి రావుది ఎ. షుల్ అప్పారావు దర్శకత్వంలో తయారయిన 'గొప్పవారి గోత్రాలు' కి పర్యవేక్షణ చాణక్య నిర్మాత యం రంగారావు.

—సీత రాజు

చిత్రసమీక్ష:

# అనుమానం పెనుభూతం

ఒక భాషాచిత్రం బాక్సాఫీసును బ్రద్దలు కొట్టినప్పుడు ఆ చిత్రానికి ఇతర భాషల్లో గిరాకీ పెరగడం తథ్యం అయితే ఆదే చిత్రాన్ని యథాతథంగా మరో భాషలో నిర్మించడం జరగడంలేదు ట్రీట్ మెంట్ లో కథకి మార్పులూ చేర్పులూ జరుగుతున్నాయి. ఆ ప్రాంతప్రజల అభిరుచిని

(64 వ పేజీ చూడండి)



'అనుమానం పెనుభూతం' లో రెలంగి, విజయ

# తారల తుపాకి కాల్పు కేసులో శ్రీ రాధాకి ఏడు సంవత్సరాల శిక్ష

ప్రముఖ తమిళ సినీ నటులు శ్రీ ఎం. జి. రామచంద్రన్, శ్రీ ఎం. ఆర్. రాధాల "తుపాకీ కాల్పు" కేసు మద్రాసులోనేకాదు, దేశమంతటా సంచలనాన్ని కల్గించింది. ఇది ఒక విచిత్రమయిన కేసు. ఇద్దరూ ప్రఖ్యాత నటులు కావడం వల్ల ప్రజల్లో ఆసక్తి రేకెత్తింది.

జనవరి 12 తేదీన శ్రీ ఎం. జి. ఆర్ కు స్వంతమయియున్న 'రామవరం' తోటలో శ్రీ ఎం. ఆర్. రాధా 'మక్కళ్ తిలకాన్ని' తుపాకితో కాల్చి, తన్ను తాను ఆత్మహత్య చేసుకొనేందుకు ప్రయత్నించినట్లు శ్రీ రాధాపై నేరం మోపబడింది ఈ కేసులో కళ్ళారా దృశ్యాన్ని చూచిన సాక్షి 'పెట్రాల్‌దాన్ పిళ్ళయా' నిర్మాత శ్రీ వాసు. ఈ కేసును సైదాపేట సబ్ మేజిస్ట్రేటు కోర్టులో విచారించి, తర్వాత సెషన్స్ కోర్టుకు పంపారు. 91 రోజుల విచారణ పిమ్మట శ్రీ ఎం. ఆర్. రాధాను నేరస్థుడిగా నిర్ణయిస్తూ, న్యాయాధిపతి ఏడు యేండ్ల కఠిన కారాగార శిక్షను విధించారు.

శ్రీ రాధా, శ్రీ ఎం. జి. ఆర్. ను చంప ప్రయత్నించడానికి కారణం వృత్తిలో ఈర్ష్య, రాజకీయ మనస్పర్థ అని నిర్ధారణ చేశారు శ్రీ రామచంద్రన్ కు వయస్సు మళ్ళినా యింకా కథానాయకుడిగా కొన్ని లక్షల ప్రజల అభిమాన నటుడు కావడం రాధాకు గిట్టలేదు. తన మార్కెట్ 'డల్' అయినందుకు ఎం. జి. ఆర్. కారకుడని యీ దారుణమయిన పని చేసాడని నీతిపతి నిర్ణయించారు.

'ఎన్ మడిప్పు' లేఖలో శ్రీ రాధా — 'కత్తిని మూసి పెట్టుకుంటే ఎలా? కత్తితో ఒక రిద్దర్ని బలి తీయాలి!' అని వ్రాసిన దానికి, అంతకు ముందు 8—1—67 న 'పెరియార్ మండపం'లో అతడు మాట్లాడిన మాటలకు సంబంధముంది. అదీ గాక, ఎం. జి ఆర్., వాసులు యిచ్చిన సాక్ష్యం దీన్ని బలపరుస్తుంది అని జడ్జి నిర్ధారణ చేసారు.

శ్రీ రాధాకు బోలెడంత అప్పు వుండడం చేత తన్ను తానే కాల్చి చంపుకొనేందుకు ప్రయత్నించినట్లు, ఈ కేసులో ముద్దాయి రాధా కఠినశిక్ష అనుభవించక తప్పదని జడ్జి నిర్ణయిస్తూ, అతడు చేసిన నేరాలకు ఏడేండ్ల కఠిన కారాగారశిక్షను విధించారు. ఈ కేసులో ప్రాసిక్యూషన్ తరఫున శ్రీ గోకులకృష్ణన్, డిఫెన్స్ కౌన్సిల్ తరఫున శ్రీ మోహనకుమారమంగళం. శ్రీ వానమామలై. శ్రీ నటరాజన్ వాదించారు.



ఎం. జి రామచంద్రన్.

## 'నేరానికి శిక్ష'

శ్రీ ఎం. జి. రామచంద్రన్‌ను, శ్రీ ఎం. ఆర్. రాధా చంపాలనే వుద్దేశంతోనే జనవరి 12 న అక్కడికి వచ్చారని, తుపాకీలో తూటా అనుకూడ యిక్కడికి రాకముందే పెట్టడం జరిగిందని సెషన్సు జడ్జి అభిప్రాయపడుతూ, అతడు చేసిన నేరాలకు ఏడేండ్ల కఠిన జైలుశిక్షను విధిస్తూ, ఈ శిక్షను యేకకాలంలో అనుభవించాలని శాసించారు.

1. ముద్దాయి ఆత్మహత్యకు పూనుకున్నందుకు ఆరుమాసాల సాధారణ జైలు శిక్ష.

2. లైసెన్స్ పొందని రివాల్వరును వుంచుకున్నదానికి 2 సంవత్సరాల కఠిన కారాగారశిక్ష.

3. తుపాకీని చట్టవిరోధంగా వుపయోగించినందుకు మూడేండ్ల కఠిన జైలుశిక్ష.

రాధా వుపయోగించిన తుపాకిని వెంటనే ప్రభుత్వానికి స్వాధీన పర్చాలి. 'ఆయుధ చట్టాన్ని' వుల్లంఘించిన రాధాకు యీ దండన సముచితమేనని. అతని వృద్ధాప్య వయస్సుపై జాలిపడి 'బి' క్లాసు జైలును యివ్వవలసిందిగా ప్రభుత్వానికి సిఫారసు చేస్తానని జడ్జి డిఫెన్స్ కౌన్సిల్‌కు సమాధాన మిచ్చారు.

ఈ కేసు 96 రోజులు సాగింది. ప్రాసిక్యూషన్ 59 మంది సాక్షులను విచారించింది. ఈ కేసుయొక్క తీర్పు 262 పేజీలు వుండడంచేత "శిక్ష" ఎంత విధించాలో అంతవరకే జడ్జి చదివారు.

ఇటీవల యిలా ప్రబలమయిన కేసు మరేదీ లేకపోవడం గమనార్హం.

— టి. ఆర్. శ్రీనివాస్

# అనుమానం పెనుభూతం

(60 వ పేజీ తరువాయి)

బట్టి దానికి రూపకల్పన చేయడం జరుగుతున్నది. లేకపోతే ఆ చిత్రం రాణించదు. అన్ని ప్రాంతాల ప్రజల్ని రంజింపజేయగల చిత్రాల నిర్మాణంలో మన మింకా బాల్య దశలోనే వున్నాము.

‘అనుమానం పెనుభూతం’ మూఢనమ్మకాలని ఆధారం చేసికొని నిర్మించిన చిత్రం. రవి విదేశాలకి వెళ్ళివస్తాడు. తల్లికి పూర్వాచారా లెక్కువ. ఆమె ఆజ్ఞల్ని అతను శిరసావహిస్తాడు. కాదని గౌరిని పెళ్ళాడుతాడు. మేనమామకి నిరాశ కల్గుతుంది. జ్యోతిష్యులచేత రవి తల్లికి నూరిపోయించి, ఒక చలనచిత్రానికి సరిపోయినంత ‘మసాలా’ తయారు చేయిస్తాడు. తను తవ్వుకున్న గోతిలో తనే పడతాడు. అంతిమ విజయం హీరోదే!

ఇదే కథ జానపదంగా నిర్మించినట్లయితే విరగబడి చూసేవారు ప్రజలు.

యస్. వి. రంగారావు, నాగయ్య, రమాప్రభ మొదలైన తెలుగు తారలతోపాటు శివాజీగణేశన్, కె. ఆర్. విజయ అదిగాగల వారు ముఖ్యపాత్రల్లో కనిపిస్తారు. హరిదాసుగా నాగేష్ కొద్ది నిమిషాలు కనిపించి గిలిగింతలు పెడతాడు. చాలాకాలం తర్వాత ఎ. ఎం. రాజా కంఠాన్ని ఈ చిత్రంద్వారా వినగల్గుతాం.

భాషాంతరీకరణంలో కొన్ని లోపాలు కొట్టొచ్చినట్టు కనిపించినా, పడిన శ్రమ ప్రతి మీటర్‌లోనూ కనిపిస్తుంది. కంఠాలు ఏకగ్రీవంగా ఆమోదించిన సన్నివేశాలు చాలా వున్నాయి. నిర్మాతల కృషి ఫలిస్తుంది. మూఢలేదనే అనుమానం పెట్టుకునేకంటే, అందరూ ఈ చిత్రాన్ని చూసి పెనుభూతాన్ని వదిలించుకోవడం మంచిది!

కె. సి. ఆర్. ఫిలిమ్స్ బానర్ క్రింద నిర్మించిన ఈ చిత్రానికి మాటలు, పాటలు అనిసెట్టి రాశారు. సంగీతం : కె. వి. మహాదేవన్—సూర్యం, నిర్వహణ కె. ఎం. నాయుడు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : కె. యస్. గోపాలకృష్ణ. నిర్మాత కె. చంద్రశేఖర రెడ్డి.

—సిత్రాజు ●

## సినిమా [illegible]

● రాష్ట్రంలో సాలీనా వసూలయ్యే వినోదపు పన్నులో పది శాతం చిత్ర పరిశ్రమ అభివృద్ధికి, లలిత కళలకు వినియోగించడానికి ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం నిశ్చయించింది. ఈ పన్ను ద్వారా ప్రభుత్వానికి ఏటా రెండుకోట్ల రూపాయలపైగా ఆదాయం వస్తుంది.

● హిందీ చిత్ర నిర్మాతలు తమ చిత్రాల ‘టైటిల్స్’కి దేవనాగరి లిపినే ఉపయోగించాలని కేంద్ర సమాచారశాఖ అక్టోబర్ 28 వ తేదీన ఒక లేఖలో ‘ఫిలిం ప్రొడ్యూసర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా’ని కోరింది.

● నేపథ్యగాయని లతామంగేష్కర్ నెలరోజులపాటు కెనడా, బ్రిటన్‌లలో పర్యటించి వచ్చారు. మాంట్రియల్‌లో ఎక్స్‌పో 67 ప్రదర్శనని కూడా ఆమె సందర్శించారు.

● రవి ప్రొడక్షన్స్‌వారి గొప్పవారి గోత్రాలు ఈ నెల 9 వ తేదీన, లలితా శివజ్యోతివారి ‘రహస్యం’ 10 వ తేదీన ఆంధ్రలో విడుదల అయినాయి.

**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.







# ఆశా మగువల
# అందమునకు మెఱుగులు దిద్దును

ఆశా స్నో మరియు పౌడరును ఉపయోగిస్తే మీ ముఖ వర్చస్సు సొగసుగా, సహజముగా వెలుగొందును. వీటితో మీ ముఖ చర్మమును మృదువుగా మనోహరముగా చేసుకోండి.

నల్లని ఆకర్షణీయమైన మీ కళ్లకు ఆశా కాటుకను కను రెప్పలకు దిద్దుకోండి. కారునలుపైన ఆశా కాటుక మీ కళ్లకు చల్లదనమును హాయిని యిస్తుంది.

ముస్తాబు పూర్తి చేయుటకు ఆశా కుంకుమతో బొట్టు పెట్టుకోండి. ఇది దీప శిఖవంటి ఎరుపు, ముదర ఎరుపు, నలుపు, మూడు రంగులలో లభించును.



**Asha**

ఫేస్ పౌడరు • స్నో • కాటుక • కుంకుమ




